# విశ్వప్రకాశం

బుద్ధ జయంతి ప్రత్యేక సంచిక
మే 1997

సం. : 3 సం. : 7 వెల : రూ. 5-00

ముఖ్య సంపాదకులు :
శ్రీ పి.వి. మనోహరరావు

సంపాదకులు
శ్రీ అక్కిరాజు రమాపతిరావు

సంపాదకవర్గం :
డా. చిరుదురాజు రామరాజు
డా. పోతుకూచి సాంబశివరావు
డా. దిట్టకవి శ్యామలాదేవి
శ్రీ కసుమయారి వేంకటశివయ్య, ఐ.ఎ.ఎస్.
శ్రీ యం.యల్. నరసింహారావు

ప్రకాశకులు :
సర్వార్థ సంక్షేమ సమితి
501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్,
గాంధీనగర్, హైదరాబాద్-500 380

పుట



ముఖచిత్రం :
**బుద్ధ భగవానుడు**

నృసింహ జయంతి మే: 20

## సంపాదకీయం

# 'బుద్ధం శరణం గచ్ఛామి.........'

మానవ జీవితంలో సుఖమున్నది, సంతోషమున్నది. తృప్తి ఉన్నది. ఆనందమున్నది. ఆశఉన్నది. కాని నిలకడ ఉన్నదా? శాంతి ఉన్నదా?!

మానవజీవితంలో దుఃఖమున్నది. శోకమున్నది. ఉద్వేగమున్నది. నిర్వేదమున్నది? వేదన ఉన్నది. కాని ఉపశాంతి ఉన్నదా? సంతృప్తి ఉన్నదా?

మానవజీవితంలోని ఆశవల్ల ఇంకా ఇంకా ఏదోపొందాలనే కాంక్ష వల్ల సంతోషంలో, ఆనందంలో, సుఖంలో, స్థిమితత ఉండటం లేదు. స్థిరత ఉండటంలేదు.

మానవజీవితంలో పసితనం ఉన్నది. శైశవం ఉన్నది. బాల్యం ఉన్నది. కౌమారమున్నది. యౌవ్వనమున్నది. వృద్ధాప్యమున్నది. చావు ఉన్నది.

చరితార్థత ఉన్నదా? పరమార్థమున్నదా?

నేనుసుఖిని, నేను ప్రశాంతుడను, నేనుదాంతుడను, నేను ఆనంద స్వరూపుడను అనే ఎరుకకు మానవుడు ఎప్పుడూ దూరంగానే ఉంటున్నాడు. ఎందుకు? అనేరహస్యాన్ని కనుక్కున్నవాడు బుద్ధభగవానుడు. ఆయనకరుణాజలధి. వేల ఎరుగని ప్రేమ ఉదధి.

బుద్ధభగవానుడు అనాత్మవాది అనటం, నాస్తికుడనటం, వేదనిందకుడనటం అజ్ఞానవిలసితం. పాషండులవలన లోకాన్ని రక్షించడానికి భగవంతుడు బుద్ధుడై అవతరించాడని భాగవతంలో ఉంది. శ్రుతులకు విపరీతార్థాలు కల్పించి పశుహింసాపరులైనవారిని ఆయన నిరసించి ఉండవచ్చుగాక. సదయహృదయుడై పశుఘాతాన్ని దర్శించలేక, 'నిందసియజ్ఞ విధేరహహ శ్రుతిజాతం, కేశవ! ధృతబుద్ధ శరీర! జయజగదీశహరే!' అని జయదేవమహాకవి గీతగోవిందంలో బుద్ధభగవానుణ్ణి ప్రస్తుతించాడు.

వేదోపనిషద్ధర్మాలకు బుద్ధబోధలు విరుద్ధాలుకావు.

కుత్సితులైన స్వార్థపరులచే విపరీతార్థ ప్రవర్తకమైనవేదమతాన్ని ఆయన సంస్కరించాడు. భారతీయ మతవికాసంకోసం సాంస్కృతిక ఉదాత్తపురోగతికోసం పరిశ్రమించాడు. భారతీయ జీవనాదర్శంలోని లోపాలను సంస్కరించాడు. ప్రపంచమంతటికీ ఆయన గొప్ప సంఘసంస్కర్త. పరమకారుణికుడు. ఆయనను మించిన కరుణామూర్తి భారతదేశంలో జన్మించలేదు. ఆయన ప్రభవించిన నాటికి అంటే భారత దేశంలో రెండువేల ఐదువందల సంవత్సరాలకు పూర్వం దురాచారాలు, బాహ్య కర్మలు, విషయలోలత్వం,

అసూయ, స్వార్థం, సంఘాన్ని కలుషితంచేశాయి. నదీజలంకోసం తగాదపడి ఇరుగు పొరుగు రాష్ట్రప్రజలు కత్తులు ఉత్తరించుకోవటానికి సమాయత్తమైనారు. బుద్ధభగవానుడు అక్కడికి వెళ్ళి మానవ జీవితపు ఉదాత్తమైనవిలువలు బోధించి ఆకలహాన్ని మాన్పాడు.

ఆయన సంఘంలోని సమస్తకులాల వారిపట్లా, సమస్తప్రజపట్లా సమానమైన గౌరవాన్నీ, ఆదరణను, ప్రేమను ముదితచిత్తాన్నే కనబరచాడు. సుఖదుఃఖాలకు అతీతమైన ప్రవృత్తిని అలవరచుకోవలసిందిగా తనను దరిచేరిన వారందరికీ ప్రబోధించాడు. కుల వ్యవస్థలో ఎంత అట్టడుగున ఉన్న వారినైనా ఆదరించాడు. అగ్రవర్ణాల వారు దూరంచేసినవిధంగా వారిని కించపరచ లేదు. వారి ఆతిథ్యాన్ని స్వీకరించాడు. దుర్మార్గుల పట్ల దుష్టుల పట్లా కరుణ భావాన్నే చూపాడు. వారి ఆధ్యాత్మిక వ్యక్తిత్వ వికాసంకోసం వారిని సమాదరించాడు.

వైశాలినగరంలో సుప్రసిద్ధురాలైన, పరమసౌందర్యరాసి అయిన రూపాజీవ అయిన ఆమ్రపాలి ఆతిథ్యాన్ని స్వీకరించాడు బుద్ధభగవానుడు. ఆ నగర రాజవంశంవారి ఆతిథ్యం కంటె ఆమె ఆతిథ్యం మిన్నగా యెంచుకున్నాడు. పరమకిరాతకుడైన అంగుళిమాలుడిలో మనః పరివర్తనం కలుగ చేశాడు. బుద్ధదేవుడు ఆయన దీనజనులను ఎంతగానో ప్రేమించాడు. ఆయన జీవితచరమాంకంలో చిట్టచివరి ఆతిథ్యం చందుడనే కమ్మరి ఇంట పావానగరంలో స్వీకరించాడు. బుద్ధుడు ప్రవర్తింపజేసిన భిక్షుసంఘంలో వర్ణ భేదాలు లేవు. నదులన్నీ సముద్రంలో చేరగానే నామరూపాలు కోల్పోయినట్లే భిక్షు సంఘంలో చేరిన వారు తమసాంఘిక కులవ్యవస్థనుంచి విముక్తులైనారు.

వైరులనడుమ అవైరులమై జీవించడమే జీవితంలో కెల్లా ఉత్కృష్టమైన ఆనందమని బుద్ధుడు బోధించాడు. బుద్ధుడు ప్రబోధించిన, ప్రవర్తింపచేసిన సాంఘిక జీవన విధాన్ని, తత్త్వోపదేశాన్ని సద్ధర్మమంటారు. చరాచరజీవకోటికి వసుంధర ఆధారమైనట్లు సమస్త సద్గుణాలకు ఉత్తమ శీలమే ఆధారమని భగవానుడు నొక్కి చెప్పాడు. దుశ్శీలుడు పశువుతో సమానమనీ మూఢుడైన మనుజుడు ధర్మానికి భాజనుడు కాడనీ ఆయన బోధించాడు. బాహ్యాచారములవల్ల ఒకవ్యక్తికి పవిత్రత సమకూడదని ఆయన ప్రబోధించాడు. క్షమ, ప్రేమ, దానశీలము, సత్యము అలవరచు కొన్నవాడే జీవిత సాఫల్యానికి అర్హుడని ఆయన చెప్పాడు. రోగార్తులకు సేవచేయడమే జీవిత ధన్యత అనిబుద్ధభగవానుడు ఆచరించి చూపాడు. రాజగృహంలో సిగాలుడనే తరుణ వయస్కుడు తన తండ్రి చనిపోతూ సమస్తదిక్కులను రోజూ పూజించవలసిందని బోధించగా వివిక్త ప్రదేశానికి వెళ్ళి రోజూ నాలుగు దిక్కులకూ భూమ్యాకాశాలకూ ఆయువకుడు ప్రణామాలు చేస్తూ ఉండగా ఆకుర్రవాడి దగ్గరకు వెళ్ళి బుద్ధదేవుడు తండ్రిమాటల్లోని పరమార్థాన్ని బోధించాడు. తల్లిదండ్రులను తూర్పుదిక్కుగానూ, గురువులను దక్షిణదిక్కుగానూ, భార్యనూ సంతానాన్ని పడమటిదిక్కుగాను, సఖులను సహచరులను ఉత్తరదిక్కుగాను, పరిజనులను సేవకులను భూమి దిక్కుగాను, శ్రమణులను,

బ్రాహ్మణులను ఊర్ధ్వదిక్కుగానూ ప్రాజ్ఞుడైన మానవుడు పూజించాలని తెలియచెప్పాడు. ఇందుకనుగుణంగా ఆయాదిక్కుల ప్రాతినిధ్యపూజితులు తమను పూజించేవారిని ఏవిధంగా రక్షించాలో, కనిపెట్టి ఉండాలో బోధించాడు బుద్ధభగవానుడు.

లోకము అనిత్యము, నిరాశ్రయము, హీనము, దుఃఖాకరమని గుర్తించటమే జ్ఞానమని తెలియచెప్పాడు బుద్ధభగవానుడు. గాలిలోని దీపంవలె జీవితం చంచలమని తెలుసుకోవలసిందిగా ఆయన కోరాడు. మానవజీవిత పరమధర్మం మూర్తీభవించిన వాడు బుద్ధభగవానుడు. రాగ ద్వేష మోహాలను ఉన్మూలించడమేనిర్వాణమని ఆయన చెప్పాడు. నిర్వాణమంటే కామం, ద్వేషం, అజ్ఞానం మొదలైన అగ్ని జ్వాలలు ఉపశమించటమే అని ఆయన బోధించాడు.

మైత్రీ, కరుణ, ముదిత, ఉపేక్షలనే నాలుగు ధ్యానాలను సాధించడమే అత్యున్నత దార్శనిక భూమిక అని బుద్ధభగవానుని బోధ.

వీటి అర్థాన్ని ఆయన ఇట్లా వివరించాడు. సుఖజీవనులపట్ల మైత్రి, దుఃఖించే వారి పట్ల కరుణ, పుణ్యకార్యాలు చేపట్టిన వారిపట్ల మోదము (సంతుష్టి, ముదితచిత్తము) దుర్మార్గులు, దుష్ట బుద్ధుల పట్ల ఉదాసీనత (ఉపేక్ష) వల్ల అంతరాత్మ ప్రసన్నత వహిస్తుందని భగవానుని ఉద్బోధ.

మహిళల నాయన ఎంతగానో గౌరవించాడు. "గుణశీల సౌందర్యవతి అయిన పుత్రిక పుత్రుడి కంటే మిన్న'' అని స్త్రీలను ప్రశంసించాడాయన. మొదట ఇష్టపడకపోయినా శ్రమణీ దీక్షను స్త్రీలవిషయంలో అంగీకరించాడుబుద్ధుడు. క్షమకుమించిన ధర్మం లేదని నిరూపించాడామహితాత్ముడు.

అయితే జగత్తులో అధిక జనసంఖ్యదుశ్శీలయుక్తమని ఆయన 80 ఏళ్ళ వయసున ప్రవచించటం విచారకరం. 29 సంవత్సరాల ప్రాయంలో 'నేను సంసారాన్ని పరిత్యజించి అటు తర్వాత 51 సంవత్సరాలు సత్యధర్మాల విశాల రాజ్యంలో యాత్రకుడిగా సంచరించానని' ఆయనే చెప్పుకున్నాడు. పవిత్రతతో మొదలై ప్రేమలోలీనమైయ్యే చతుస్సత్యయుక్తమైన సద్ధర్మాన్ని ఆయన ప్రజలకు బోధించాడు.

"చిత్రం జంబూద్వీపం మనోరమం జీవితం మానుష్యమ్'' అని భారత వర్షం చిత్రమైన అద్భుతమైన దేశం, ఇక్కడి మానవజీవితం మనోజ్ఞమైనది - అని భగవానుడు కొనియాడినట్లు పండితులు చెపుతున్నారు. భిక్షుసంఘం తనపై ఆధారపడి ఉందనీ, తాను మార్గదర్శకుడననీ ఆయన భావించలేదు.

ఒక దేశపు సుస్థితి, ఆదేశ ప్రజల నిర్విచారక్షేమజీవనం దేనిపై ఆధారపడి ఉంటుందో

బుద్ధభగవానుడు గణతంత్రరాజ్య పాలకులకు ఇట్లా హితవు చెప్పాడు. "తరచుగా సమావేశమవుతూ ఐకమత్యాన్ని వీడకుండా ప్రజలను కఠిన శాసన రహితంగా పరిపాలిస్తే పూర్వ సంప్రదాయాలను అనుసరిస్తూ స్త్రీలను, కన్యకలను గౌరవిస్తే" ఎటువంటి బలవంతులు కూడా ఆదేశాన్ని జయించలేరని బుద్ధ భగవానుడు ప్రబోధించాడు.

ప్రపంచంలోని అనేక దేశాలలో బౌద్ధ ధర్మం వ్యాపనమైంది. ప్రపంచభాషలలో బౌద్ధదర్శనంపై ఎన్నో గ్రంథాలు వచ్చాయి. భారతదేశపురాణ పురుషులలో చారిత్రక వ్యక్తులలో అవతారమూర్తులలో ప్రపంచ ప్రసిద్ధుడు బుద్ధభగవానుడే.

ఒకప్పుడు ఆంధ్రదేశాన్ని బౌద్ధ ధర్మం ఎంతగానో ప్రభావితం చేసింది. ఆర్యనాగార్జునుడి వంటి బౌద్ధ దార్శనికులెందరో ఆంధ్రదేశానికి చెందినవారు ప్రపంచప్రఖ్యాతులైనారు. అమరావతీ స్తూపం ఆంధ్రులు బౌద్ధ మతంతో ఎంతగా తాదాత్మ్యం చెందారో గొప్ప చారిత్రక సాక్ష్యంగా ఈ నాటికీ శిధిలప్రభతో విలసిల్లుతున్నది.

నిండు యౌవ్వనంలో పరమసౌందర్యరాశి అయిన పత్నిని, ఈషణలన్నిటిలో పరమబలీయమైన పుత్రేషణను, పరమప్రేమపాత్రుడైన తండ్రిని, భోగభాగ్యసంపదలతో కూడిన రాజ్యాన్ని పరిత్యజించడం కన్నా ప్రస్తుతించదగిన త్యాగమేమున్నది? తెలుగులో బౌద్ధ దర్శనాన్ని గూర్చి వచ్చిన గ్రంథాలన్నిటిలో శ్రీరత్నాకరం బాలరాజు గారి గ్రంథం ప్రశస్తమైనది. తెలుగు వారిలో బుద్ధదార్శనికులలో వారు అగ్రేసరులు. ధమ్మపదం పాళీ సంస్కృతచ్ఛాయలతో వారు హృదయంగమంగా తెలుగులోకి అనువదించారు. సమగ్రంగా సాకల్యంగా సాధికారంగా బుద్ధభగవానుడి దివ్యజీవితాన్ని తాత్త్విక బోధను, దర్శనాన్ని తెలుసుకోవాలనుకొన్నవారికి పరమశరణ్యమా గ్రంథం.

*"సామ్యవాదానుసారమైనదో మరేదో యెకవిధమేనదో యగు ప్రజాపరిపాలనము (దాని పేరేదైన కానిండు) రంగస్థలమునకు రాబోవు సూచనలు సర్వత్ర కానిపించుచున్నవి తమకు గల జీవితావశ్యక వస్తు లోపమును తీర్పుమనియు, తమ కర్మభారమును తగ్గింపు మనియు పీడనము నిర్మూలింపుమనియు, యుద్ధములు లేకుండ జేయుమనియు ఆహార సమృద్ధి నేర్పరుపుమనియు ప్రజలు అడిగి తీరుదురు. ఈ నాగరకత యైనను, మరే నాగరకతయైనను - ఆస్తిక ధర్మము పైగాని - మానవులలో గల యోగ్యతపై గాని ఆధారపడినది కానిచో - కొంతకాలము నిలిచి యుండునని ఎవరు అభయము ఈయగలరు? ఆస్తిక ధర్మము ఈసమస్యను ఆమూలాగ్రముగా పరిష్కరించునని నమ్ముడు. అది చక్కగా నుండెనేని సర్వమును చక్కగా ఉన్నట్టే".*

**- స్వామి వివేకానంద**

# చిత్ ప్రకాశమే అమృత తత్త్వం !

- శ్రీ కస్తూరి భాస్కరరావు

ఆత్మజ్ఞానమే అన్ని జ్ఞానాలకు పరమావధి! సంగమే బంధం - సర్వసంగ పరిత్యాగమే మోక్షం ! ఇదే పరమ రహస్యమైన పరతత్త్వం! ఈ దేహంలోని పురుషుడిని 'బ్రహ్మం' అని శ్రుతి నిర్దేశించింది. అన్ని తత్త్వాలకూ యిది తలమానికం! అదే 'సోహం'-అనే జ్ఞానం కూడా. ఇదే 'అమృతార్థ తత్త్వం' !-

ఈ విశ్వం అంతా ఒకే ఒక జ్యోతి స్వరూపం! అది నిరుపమానమైంది. ఏ కర్మల్లోనూ అది లీనంకాదు. ఏ విధంగా ఊహిస్తే అలాగే జ్యోతి దర్శనమిస్తుంది. ఏ బంధాలకీ కట్టుబడని జ్ఞానులకి ఈ విశ్వమంతా తనవాళ్లలాగానే కన్పిస్తారు. జీవులంతా చివరికి ఒకే పదార్థంలో లీనమైపోతారు. ఆ విధంగా అంతా లయమైపోతుంది. పరమాత్మ నిర్మించిన ఈ విశ్వంలో పుణ్యకర్మలు, పాపకర్మలు, మిశ్రమ కర్మలూ కలిసి వున్నాయి. చీమనుంచి బ్రహ్మవరకూ అంతా కర్మబద్ధులు కావల్సిందే! కర్మఫలాన్ని జీవుడు అనుభవిస్తున్నాడు. ఈ దేహమే కర్మను అనుభవించే కర్మక్షేత్రం! ఈ పవిత్ర భూమే విశ్వమాత ! విశ్వనాథుడే మూలప్రకృతి! కర్మబీజాన్ని పూర్తిగా నాశనం చేయటానికి మన భరతఖండంలోనే జన్మించాలి. బ్రహ్మలోకంలోని వారికి కూడా యిదే కర్మక్షేత్రం! ఆసక్తిని వదలి సంచరిస్తే మనల్ని ఏ కర్మా బంధించదు. దైవారాధన చేస్తే జన్మసాఫల్యం కలిగి తక్షణం బ్రహ్మసాయుజ్యం లభిస్తుంది.

మంత్రం॥ సర్వవ్యాపినమాత్మానం క్షీరే సర్పిరి వార్పితమ్ ।
ఆత్మ విద్యాతపో మూలం తద్బ్రహ్మోపనిషత్ పరమ్ ॥

- (శ్వేతాశ్వతర ఉప॥)

తపస్సు, ఆత్మజ్ఞానం - ఈ రెండే ఆత్మ సాక్షాత్కారానికి ముఖ్యసాధనాలు. వీటివల్లనే పాలలో సర్వత్రా కలిసి వున్న వెన్నలాగా అంతటా వ్యాప్తమైన పరమాత్మను దర్శించగలం ! అప్పుడే అజ్ఞానం పూర్తిగా నశించి సత్యం, తపస్సు సిద్ధించేది. శాస్త్రజ్ఞానం వల్లనే జ్ఞానం కలుగుతుంది. భగవదర్పితంగా చేసిన ధర్మం, సాధనలవల్ల అంతఃకరణ శుద్ధి అవుతుంది. అప్పుడు అచంచలమైన భక్తి ఏర్పడి పరమాత్మను తెలుసుకునే వీలుకలుగుతుంది. తర్వాత లభించేది ముక్తే! పరమాత్మ జ్ఞానం లభించినవారు తిరిగి ఈ జగత్తులోకి రారు అని శ్రుతి చెప్పింది.

'నసపునరావర్తతే నసపునరావర్తతే !'- అని

ఆత్మ సాక్షాత్కారంలో చూడదగినది ఏమీ వుండదు. 'ఎరుక'యే దాని స్వరూపం.

చూడబడేది, చూసేది, చూపు - ఈ మూడూ అసలు నేను యొక్క అభివ్యక్తాలు. దాని వెలుగుతోనే శరీరం, అహంకారం, ప్రపంచం అన్నీ ప్రకాశిస్తాయి. వెలుగు చీకట్లను రెంటినీ ప్రకాశింపచేయుగలదే 'చిత్‌ప్రకాశం'- అదే విశ్వ ప్రకాశం!

ఆ విశుద్ధ చైతన్యం జ్ఞానాజ్ఞానాల్ని రెంటినీ ప్రకాశింపచేస్తుంది! మనలోని అహంకారాన్ని ఆత్మాధీనం చేసి మనస్సుని సంయమంలో వుంచుకోవాలి. సర్వజగత్తూ ఆత్మలోనే వుంది! ఆత్మను పొందటానికి మనం బైటికి ఎక్కడికో పోనక్కర్లేదు. అది మనకు అవ్యవహితంగా వుంది. దాన్ని విడిచి మనం ఒక్క క్షణం కూడా వుండలేము. దాన్ని ముందుగా జాగ్రదవస్థలో తెలుసుకుంటే తర్వాత మూడవస్థల్లోనూ అవిచ్ఛిన్నంగా వున్నట్లు తెలుసుకోవచ్చు.

జీవన్ముక్తులికి రాగద్వేషాలులేని దృష్టి తెలుసుకోవచ్చు. వారికి సాంసారిక భోగాలు రుచించవు-కీర్తి కాంక్ష వుండదు. వాళ్లు జీవించి వుండగానే ముక్తస్థితి పొందుతారు. మానవుడి జన్మే పునర్జన్మని కూడా తెలుపుతుంది. అందుచేత మానవులు మరణాన్ని గురించి శోకించరాదు. జననమరణాలు చక్రభ్రమణం వంటివి. మానవులంతా ధాన్యం లాగానే మొలిచి పెరిగి చివరికి రాలిపోతారు. జీవిత రహస్యం మరణంలో వుంది. కనుక ముముక్షువులు మృత్యువుని గూర్చి ధ్యానిస్తే ఈ భౌతిక జీవితం ఎంత క్షణభంగురమో స్పష్టంగా తెలుస్తుంది. ఆ భావననే ఒక సాధనగా చేస్తే వైరాగ్యం కలిగి నిత్యచైతన్యం దర్శనమౌతుంది. దానినే 'అమృతత్త్వం' అంటారు. మన ఆరాటం అంతా దానికోసమే.

మృత్యుపాశాలంటే మనలోని దుర్జడత, కామం, లోభం, ద్వేషం, అజ్ఞానం మొదలైనవి. 'మృతి' అంటే మనిషి సహజస్థితి. నష్టమవటమే కాని దేహపతనంకాదు. ఛాందోగ్యోపనిషత్తులో ఒక విశిష్టమైన శ్లోకం గమనించండి-

"సోమ్యపురుషస్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే।

మనః ప్రాణే, ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయాం" ॥

-ఆత్మ ప్రయోజనం కోసమే భార్య, భర్త, పుత్రులు, ధనం, పంచభూతాలు, లోకాలు వీటన్నింటినీ మనం ప్రేమించినా వాటి ప్రయోజనం కోసమే ప్రేమించటంలేదు. కేవలం మన ప్రయోజనం కోసమే ప్రేమిస్తున్నాం! అందుచేత విజ్ఞానం కలుగగానే యథార్థమైన ఆత్మ స్వరూపం కన్పిస్తుంది-

అదే అమృతత్వానికి సాధనం! సాధన చతుష్టయ సంపన్నుడు కానిదే ఎవ్వరూ ఆత్మవిద్యను పొందలేరు. నిత్యానిత్య వివేకం, ఇహాముత్రఫలభోగ విరాగం, జీవిత సుఖాలంటే వైరాగ్యం, శమదమాది షట్క సంపత్తి, మనో నిగ్రహం, ఇంద్రియ నిగ్రహం, సహనం, శాంతి, శ్రద్ధ తప్పనిసరిగా వుండాలి. ఇవి వున్నవాడే మోక్షార్హుడు. సూక్ష్మంగా తాత్త్విక చర్చ చేయటంవల్ల ఈపరావిద్యరాదు. స్వయం స్ఫూర్తి తోనే గ్రహించాలి! సుఖాలంటే ఆశ, ఆసక్తి

అనే మాలిన్యాలు మనస్సులో నుంచి పూర్తిగా క్షాళిత మైతేనే తప్ప ఈ సత్యగ్రహణం సాధ్యంకాదు.

'హృత్సరోజే హ్యహంరూపా యాచితిర్నిర్మలాచలా!
అహంకారపరి త్యాగాత్ సాచితిర్మోక్షదాయినీ' - (దేవీకాలోత్తరం)

-హృదయ కమలంలో 'నేను' అనే రూపంకలది, నిర్మలమైంది, అచలమైన జ్ఞానం- అహంకార రహితమైనట్టి మోక్షం కలుగ చేస్తుంది. సర్వోపాధుల నుంచీ తొలగండీ, ఎడతెగనిది అయిన జ్ఞాన రూపమే శివుడు. ఆశివరూప జ్ఞానమే నేను అని తలచి అన్నిటి మీదా ఆశను వొదిలి పెట్టాలి!

అజ్ఞానాంధకారానికి ఆవల అనందప్రకాశ స్వరూపుడైన పరమాత్మను నేను సాక్షాత్కరించుకున్నప్పుడే మృత్యువుకు అతీతుడ్ని అవుతాను. చావుపుట్టుకల చక్రభ్రమణం నుంచీ తప్పించు కునేందుకు యింతకు మించి వేరే మార్గంలేదు.

మంత్రం॥ వేదాహమేతం పురుషం మహాంత మాదిత్యవర్ణం తమసః పరస్తాత్।
తమేవ విది త్వా2 తి మృత్యుమేతి, నాన్యః సంధా విద్యతే2యనాయ'॥-
-(శ్వేతాశ్వేతర ఉప॥)

మనలోవున్న దివ్యత్వాన్ని మరిచిపోయి సర్వత్రా ఆత్మని దర్శించలేక పరిమితమైన జీవభావంతో భయభ్రాంతులకి, సుఖ దుఃఖాలకి లోనవుతున్నాం! అంతటావున్నది ఆత్మపదార్ధం అనే ధృడ నిశ్చయం కుదిరిన నాడు ద్వంద్వాతీతులమై నిర్భయత్వం చెందుతాము. క్షణికమైన ఈదేహం ఇంద్రియాలతో తాదాత్మ్యం చెందని ఆత్మజ్ఞాన నిష్ఠాపరుడికి చావుపుట్టుకలు లేవు- ఇంద్రియ విషయలోలత్వం లేదు. కనుక వానికి అసంగత్వం వల్ల శాశ్వతానందం లభిస్తుంది! 'నేను ప్రాణవాయువు కాదనీ, మనస్సు కాదనీ అది శుద్ధమైనదని వేదాలు ఘోషిస్తున్నాయి.

సర్వోత్కృష్టమైన దాన్ని నిరంతరం ధ్యానిస్తే భగవత్స్వరూపులే అవుతాము. మోహమనే సముద్రాన్ని దాటి రాగద్వేషాదులనే రాక్షసుల్ని సంహరించి యోగి శాంతియుతుడై ఆత్మారామునిలా విరాజిల్లుతూ వుంటాడు. మోహాన్ని, రాగద్వేషాదుల్ని జయించిన శాంత మనస్కుడే నిజమైన యోగి!

"బంధ ముక్త్యాతీతం పరం సుఖం
వింద తీహ జీవస్తు దైవికః" -(రమణుల 'ఉపదేశసారం')

- తనను తాను ఎరిగిన దైవికుడైన పుణ్యచరితుడు బంధముక్తులులేని పరమ సుఖసిద్ధిని పొందుతాడు. ఆ పరసుఖ సిద్ధిలో బంధంగాని, ముక్తిగాని వుండదు. అదే ఆత్మసుఖం -

సహజమైనది. ఆత్మ ఆద్యంతరహితం, సచ్చిదానంద స్వరూపం. కర్మం అసలు చేత ఆత్మకు బంధముక్తులు లేవు. అది బంధముక్త్యాతీతమై ఉంటుంది.

శిక్షితమైన మనస్సు, బుద్ధి, విశుద్ధమైన అవబోధలవల్లనే ఆత్మ బోధింపబడుతోంది. అవబోధకున్న మాలిన్య లక్షణాల్ని వదిలేస్తే మనస్సు. ఆత్మకోసం హృదయపూర్వకంగా నిరంతరం ఆరాటపడేవానికే అది సాక్షాత్కరిస్తుంది. ఆత్రుత, ఆరాటం, అజ్ఞానాన్ని పూర్తిగా తుడిచివేయగా చివరికి ఆత్మ స్వయంగా ప్రకాశిస్తుంది! ఈ లోకంలో మనకి కన్పించేదంతా ఆత్మ వైభవమే! దాని నివాసం హృదయాకాశంలోని బ్రహ్మపురంలో! పరిపూర్ణ విజ్ఞానంతో ప్రాజ్ఞులు ఆహ్లాదమయమైన అమరత్వస్థితిని సాక్షాత్కరించుకుంటారు. ఆనందకోశంలో నిగూఢ గహనాల్లో నిర్మలమైంది, నిరవయవమైంది, విశుద్ధమైనదీ అయిన బ్రహ్మం జ్యోతి స్వరూపంగా ఆత్మ ప్రకాశిస్తుంది.

శ్లో॥ ఆత్మానాత్మ వివేకః కర్తవ్యోబంధముక్తయే విదుషా
తేనావానందీ భవతిస్వం విజ్ఞాయ సచ్చిదానందం"-

- బంధాలనుండి విముక్తుడవ్వాలంటే ముముక్షుడైన విద్వాంసుడు ఆత్మానాత్మల వివేకాన్ని పొందాలి. దాని వల్లనే సచ్చిదానందరూపుడనని గ్రహించి ఆనందాన్ని పొందుతాడు.

కర్మలన్నీ బంధహేతువులే! వాటివల్ల చిత్తశుద్ధే కలుగుతుందిగాని అవి తత్త్వదృష్టికి ఉపకరించవు. ఈ విధమైన 'సమ్యగ్ విచారణ' వల్ల మనకు భయాలు, దుఃఖాలు పోతాయి. ఈ సంసారబంధమనే దీర్ఘరోగానికి నిరంతర విచారణే పరమౌషధం!

భగవాన్ రమణులు సన్యసించలేదు. వారిది 'అత్యాశ్రమం'- అంటే వారు నాలుగు ఆశ్రమాల్ని దాటినవారు. వారికి విధి నిషేధాలు లేవు. వారికి ఆత్మే గురువు! అరుణాచలేశ్వరుడే తండ్రి! గురువు- అన్నీ. ఆ గురువు ఆంతరంగికంగా వుండి ప్రబోధిస్తాడు. వారికి ఏ విధమైన నియమాలూ, శాస్త్రాలూ వర్తించవు.

మన కర్తవ్యం ఆత్మవిచారణ చేయడమే! తక్కినదంతా ఆ అంతరశక్తే చేయిస్తుంది. నిరంతరం హృదయంలో నిలకడగా వుండాలి. మన భవిష్యత్తును నిర్ణయించేది భగవంతుడే! జరగాల్సింది సక్రమంగా సకాలంలో జరుగుతుంది. ఆరాటపడరాదు. నిస్పృహపడకూడదు. హృదయంలో స్థిరంగావుండి ఆత్మ నిష్ఠులమై ఎల్లప్పుడూ ఎరుకలో వుండాలి. గురువు మీద పూర్తి విశ్వాసంతో వుండాలి!

'చిత్‌ప్రకాశం' జ్ఞానాజ్ఞానాల్ని రెంటినీ ప్రకాశింపచేస్తుంది. వెలుగునీడల్ని రెంటినీ అది ప్రకాశింపచేస్తుంది. అదే విశ్వప్రకాశం! జగత్తులో కన్పించే రూపాలన్నీ చైతన్యంతో కూడిన రూపాలే! వాటిని ధరిస్తూ వున్న సత్పదార్థం అన్నీ శివుడే! అంటే దృశ్యానికీ, ద్రష్టకూ రెంటికీ కూడా అధిష్ఠానమైనవాడు శివుడు! గడిచిపోయిన కాలంలో సమస్తమూ అతడే! అటువంటి

సనాతన తత్వాన్ని అపరోక్షరూపంలో అనుభవంలోకి తెచ్చుకున్న సాధకుడు మృత్యువును తరిస్తాడు. ఈ విధంగా అపరోక్షానుభూతి-బ్రహ్మ-ఆత్మ ఒక్కటే అనే అనుభవం తప్ప మోక్షానికి వేరే మార్గంలేదు. అన్నిటినీ సమభావంతో చూచే యోగి సమస్త భూతాల్లోనూ వున్నట్టి ఆత్మను, దానిలోవున్న సమస్త భూతాలను చక్కగా చూస్తూ పరబ్రహ్మను సాక్షాత్కరించుకోగలుగుతాడు. ఇంతకంటే వేరే మార్గమూలేదు- సాధనమూలేదు.

ఏ పరబ్రహ్మ అందరికీ ఆత్మస్వరూపుడై వున్నాడో, ఏ పరమాత్మ ఏ మహత్తత్త్వం సూక్ష్మాతి సూక్ష్మమై నిత్యమై వున్నదో ఆ మహత్ తత్వానివి నీవే! నీవే ఆ మహత్ తత్వానివి!

సచ్చిదానంద స్వరూపుడను, పరమాత్మను అయిన నానుండే ఈ ప్రపంచాలన్నీ పుట్టాయి. నాలోనే అన్నీ వుంటున్నాయి- నాలోనే లయమవుతాయి. అట్టి అద్వితీయుడైన పరబ్రహ్మను నేనే!

మంత్రం॥ 'తమాది మధ్యాంత విహీనమేకం
విభుం చిదానంద మరూపమద్భుతం।
ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం
త్రిలోచనం నీకంఠం ప్రశాంతం।
ధ్యాత్వామునిర్గచ్ఛతి భూతయోని
సమస్త సాక్షిం తమసః పరస్తాత్' ॥ - (కైవల్యోపనిషత్)

'త్వమేవ పరమాత్మా ఽ సిత్వమేవ పరమోగుణః ।
త్వమే వాకాశ రూపో ఽ సిసాక్షిహీనో ఽ సి సర్వదా ।
త్వమేవ సర్వభావో ఽ సిత్వం బ్రహ్మోసి నసంశయః ।
కాలహీనో ఽ సి సదాబ్రహ్మోసి చిద్ఘనః' ॥ -

-- ఓం తత్‌సత్ ! --

*కర్తవ్య మేవ కర్తవ్యం ప్రాణైః కంఠగతైరపి।*
*అకర్తవ్యం నకర్తవ్యమ్ ప్రాణైః కంఠ గతైరపి॥*

కంఠం నుంచి ప్రాణాలు పోవటానికి సిద్ధంగా ఉన్నా చేయవలసిన దానిని చేయాలి. కంఠం నుంచి ప్రాణాలు పోవటానికి సిద్ధంగా ఉన్నా చేయకూడనిది చేయరాదు.

విశ్వయోగికి జయకృష్ణ మణిమాల

# కలలోన నా స్వామి!

- డా. జంధ్యాల జయకృష్ణ బాపూజీ

కలలోన నిండుగా కనిపించి నాస్వామి
కనుతెరచినంతనే కనిపింప విదియేమి ॥ కల ॥
నీ యోగదృష్టిలో వేదాలు నిండేను

నీ రాగదృష్టిలో భాగ్యాలు పండేను
నీ పరామర్శలో మనసులే మురిసేను
నీ పదస్పర్శలో తనువులే విరిసేను ॥ కల॥

ఘనమైన నీ కరము అత్యంత శుభకరము
మృదువైన నీ పదము దివ్యమహిమాస్పదము
దృఢమైన నీ స్వరము సౌశీల్య భాస్వరము
ప్రియమైన నీ ముఖము సౌహార్ద సమ్ముఖము ॥ కల ॥

నీ మధురభాషణలు వాగ్దేవి భూషణలు
నీ మందహాసాలు లక్ష్మీవిలాసాలు
నీ జటల లాస్యాలు గౌరీ విలాసాలు
నీ కార్యకరణాలు లోకకల్యాణాలు ॥ కల ॥

# అందని వాడవు నీవా ?

అందనివాడవు నీవా స్వామీ
అందరివాడవు కావా ఏమీ ॥అందని॥

నిన్ను చేరాలనీ
చేరి కోరాలనీ
కోరి మురియాలనీ
మురిసి తరియాలనీ
ఏదో ఏదో ఊహల ఊయల ॥అందని॥

మనిషికి మనసెందుకు
మనసుకు మమతెందుకు
మమతకు మృతి ఎందుకు
మృతికిక స్మృతి ఎందుకు
ఎన్నో ఎన్నో ప్రశ్నల మాలిక ॥అందని॥

వేదం నీ సృష్టే
వాదం నీ సృజనే
మోదం నీ చలవే
ఖేదం నీ వలనే
ఏవో ఏవో సందేహాలివి ॥అందని॥

# విశ్వయోగి లేవయ్యా !

సత్యశోధ కలిగించే
విశ్వయోగి లేవయ్యా
సత్వబోధ చిలికించే
వీతరాగి రావయ్యా ॥సత్య॥

వినతులైన జనులెందరో
వేలవేల కనులతోడ
వేడుకొనుచు నిలబడి రిక
వేంచేయుము విశ్వతేజ ॥సత్య॥

మా మధ్యన నీ వున్నా
నీ మహిమల నెరుగమయ్యా
వాత్సల్యము వర్షించిన
తమితీరని నరులమయ్యా ॥తస్య॥

మా డెందము పరుపువోలె
పరచినాము నీ కొరకై
అలనల్లన నడచి రమ్మా
ధన్యాత్ముల చేసి పొమ్మా ॥సత్య॥

# శ్రీ భారత సావిత్రి

-రుద్రావఝల రామకృష్ణారావు

శ్రీ మహాభారతమున స్వర్గారోహణ పర్వము చివర "భారత సావిత్రి"యను నొక చిన్న ప్రకరణము కలదు. వేదముల సారము 'సావిత్రి'యని ప్రఖ్యాతినొందినట్లు పంచమవేదమగు శ్రీ మహాభారతము యొక్క సారమే "భారత సావిత్రి" యని ప్రసిద్ధి నొందినది. వేదసారమగు నీ భారతసావిత్రియు నిత్యోపాస్యయయి యొప్పుచున్నది. లక్ష శ్లోకాత్మికమగు మహాభారతమును బఠించుట వలన లభించు పుణ్యము ఈ చిన్ని ప్రకరణమును బారాయణము చేయుటవలననే శ్రద్ధావంతులగు మానవులు పొందగలరు. అదియునుగాక మిక్కిలి విస్తారమయిన మహాభారతమునగల ముఖ్యమగు ధర్మసార మీ చిన్ని ప్రకరణము వలన సంగ్రహముగ దెలియనగును. ఈ నాల్గుశ్లోకములను బ్రతిదినము పఠించి సాధకులు ఇహపరశుభముల నందెదరు గాక !

ప్రథమ శ్లోకము

మాతా పితృ సహస్రాణి పుత్రదార శతానిచ।
సంసారేష్వనుభూతానియాన్తి యాస్యన్తి చాపరే ॥

అనాద్యవిద్యావాసనచే కర్మఫలాను సారముగా జీవులు సంసారమున పలుసారులు దేహముల ధరించుటయు, విడుచుటయు జరుగుచున్నది. దానినే జనన మరణములని వ్యవహరించుచున్నారు. ఈ జన్మ మృత్యువులనేకములగుటచేత వేలకొలది తల్లులు, తండ్రులు, వందలకొలది భార్యలు, పుత్రులు, మొదలగువారితో సంబంధమేర్పడుటయు, వారు నావారని మమకారముతో వ్యవహరించుటయు జరిగినది. లెక్కలేనన్ని దేహములు గడచుటచే లెక్కలేనంతమంది మాతృపితృకళత్ర పుత్రాదులు గడచిరి. వర్తమాన కాలమున నట్టివారితో వ్యవహరించుట జరుగుచున్నది. ఈ దేహములు విడిచిన నింకెందరో తల్లిదండ్రులు, రాగల జన్మములలో మమతాబంధమున ప్రాప్తింపగలరు. ఇట్లు సంసార ప్రవాహమున మునిగి తేలుచున్న జీవకోటులు భక్తియను నోడనాశ్రయించి ఆత్మజ్ఞానమను తీరమున జేరువఱకు నిత్యశాంతిని బొందనేరరు.

ద్వితీయ శ్లోకము :

హర్షస్థానసహస్రాణి భయస్థానశతానిచ ।
దివసేదివసే మూఢ మావిశన్తి న పణ్డితమ్ ॥

నిత్యము ప్రపంచమున సంతసింపదగు ఘటనలనేకములు తటస్థించుచుండును. అటులే భయము చెందదగు పరిస్థితులు లెక్కకు మించినవి దాపురించుచుండును. దేహమునేనని వ్యవహరించు మూఢుడు ఆనందము లభించునపుడు వ్యాకులపడుచు శాంతినొందనేరడు. దేహాదులకు విలక్షణమైన ఆత్మతానని వ్యవహరించుచు పండితుడా లాభనష్టములకు మోద ఖేదముల నొందక నిత్య శాంతియుతుడై విరాజిల్లును.

తృతీయ శ్లోకము .

ఊర్ధ్వబాహుర్విరౌమ్యేష నచ కశ్చిచ్ఛృణోతిమే !
ధర్మాదర్ధశ్చ కామశ్చ సకిమర్థం నసేవ్యతే ॥

చేతులు పైకెత్తి బిగ్గరగా అఱచి చెప్పుచున్నాను. అదేమి వింతయో ఒకడైనను దానిని వినడు. నేను చెప్పునదేమనగా :- ధర్మాచరణమువలన నర్థమును కామమును లభింపగలవు. అట్టి ఉత్తమ ఫలప్రదమగు ధర్మమును మానవులేల సేవింపరో (మానవుడు ధర్మముగ నడచుట వలన తత్ప్రభావమున గీర్తిని బొందును. దానివలన ద్రవ్యలాభము, ధనము వలన నిహలోకమున ధర్మావిరుద్ధమగు భోగానుభవము, పరసుఖహేతువగు సత్కార్మాచరణము సిద్ధించును. కావున మనుష్యుడు ధర్మపరుడై శాంతి నొందగలడు.)

చతుర్థ శ్లోకము :

నజాతు కామాన్న భయాన్నలోభాత్
ధర్మంత్యజేజ్జీవిత స్యాపి హేతోః!
నిత్యోధర్మః సుఖదుఃఖేత్వనిత్యే
జీవోనిత్యోహేతురస్యత్వ నిత్యః ॥

కామమువలనగాని, భయమువలనగాని, ప్రాణరక్షణ కొఱకుగాని, యెన్నడైనను ధర్మమును విడువరాదు. ఏలననగా :- ధర్మము జీవునకు నిత్యసుఖము నొసంగునది. సుఖదుఃఖము లనిత్యములయినవి. జీవుడు నిత్యుడు. జీవుని కృతార్థునిగ జేయగల సత్కర్మములుగాని జీవునకు దుఃఖములుగూర్చు కామభయలోభాదులుగాని అనిత్యములు, అనిత్యములగు కామభయలోభాదులకు లోనయి నిత్యమగు ధర్మమును విడుచుట వలన నిత్యుండగు జీవునకు అనర్థముగూర్చుటయగును. కావున మానవులు ధర్మపరులయి శాంతి నొందెదరుగాక !

ఫలశృతి :

ఇమాం భారత సావిత్రీం ప్రాతురుత్థాయయః పఠేత్ ।
సభారత ఫలం ప్రాప్య పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥

ఏ మానవుడు ప్రాతఃకాలమున లేచి యీ భారతసావిత్రిని చదువునో ఆతడు మహాభారతమునెల్ల చదివిన ఫలమును బొంది, పరబ్రహ్మమును జేరగలడు!

**సారాంశము :**

జననమరణరూప సంసార దావానలమున జిక్కి తాపత్రయ సంతప్తుడగు మానవునకు నిత్యశాంతిని జేకూర్చుటకై వెలువడిన "శ్రీ భారతసావిత్రి" మొదటి శ్లోకమున వైరాగ్యమును బోధించి, రెండవ శ్లోకమున ఆత్మజ్ఞాన ఫలమును దెలియజేసెను. మూడవ శ్లోకమున జ్ఞానవ్యాప్తికి సాధనమగు ధర్మాచరణమునుపదేశించెను. నాలుగవ శ్లోకమున ధర్మాదిసాధనముల ద్వారా జీవునకు నిత్యశాంతిని జేకూర్చుటయే మానవకర్తవ్యమని హెచ్చరించెను. శ్రీ భారత సావిత్రి యుపదేశముల నాచరణలోనుంచు శక్తిని పరమేశ్వరుడు మానవుల కొసంగుగాక !

# ఆకాంక్ష

- శ్రీమతి వనం సావిత్రీనాథ్

కదిలేకాలం కనులముందరే కర్పూరంలా కరిగిపోతూంది
మదిలో భావాలన్నీ కలల రూపంతో సాక్షాత్కరిస్తున్నాయి
కలలు నిజాలవటం కృషీవలులకు సాధ్యం
కల్లలుగా మిగలటం సోమరులకు సాక్ష్యం
ఎందరెందరో ఎన్నెన్నో చేయాలనుకుంటారు
ఏమీ చేయలేక కాలానికి వదిలేస్తారు
కాలగర్భంలో కలిసిపోతారందరూ
కలల పంటలు కలిసి వస్తే ఇలలో అమరులవుతారు
అక్షర రూపంలో క్షరం లేని దక్షత పొందాలని
లక్షల హృదయాలలో నిరంతరం నిలవాలని
కాలంతో పరుగులు తీస్తూ నాకలం సాగాలని
కనులు మూస్తే ఓ కల ప్రత్యక్షమవుతుంది
సాహితీ క్షేత్రంలో నేనేసే బీజాలు
సమ రస స్వార్థ రహిత వటవృక్షాలై ఎదగాలని
మనిషిలోని అసూయా ద్వేషాలు హింసా దౌర్జన్యాలు
ఆ తరుచ్ఛాయ వాయువులలో చెల్లాచెదురయి
సర్వేజనా సుఖినోభవంతు అన్న
నా స్వప్నం సత్యమవ్వాలన్నదే నా ఆకాంక్ష

# అనుభవతరంగిణి

- శ్రీ జి.వి.యల్.యన్ విద్యాసాగరశర్మ

(గతసంచిక తరువాయి)

నీటిపారుదల శాఖలో సూపరింటెండింగ్ ఇంజనీరుగా చాలా కాలం పని చేసి, అనేక ప్రశంసలు పొందిన ప్రతిభావంతుడు శ్రీకుంపట్లవెంకటేశ్వర్రావ్. ఆయన పదవీవిరమణానంతరం గుంటూరులోని కృష్ణనగర్‌లో, తమస్వంత ఇంట్లో విశ్రాంతి తీసుకొంటూ ఉండేవాడు. ఆయన ఉద్యోగంలో ఉంటున్నప్పుడు కొంతకాలం పుట్టపర్తిలో ఉద్యోగరీత్యా పనిబడి ఉండవలసి వచ్చింది. అప్పుడాయన భగవాన్ సత్యసాయిబాబాను దర్శించి, వారి ప్రేమకు ఆకర్షితుడై, ఆయనకు భక్తుడయ్యాడు. సుప్రసిద్ధ పారిశ్రామిక వేత్త శ్రీగోగినేని కనకయ్యగారితో ఆయనకు బాగా పరిచయం ఉండటంవల్ల-కనకయ్యగారు పదవీ విరమణం చేసి, విశ్రాంతి తీసుకొంటున్న వెంకటేశ్వర్రావు గారి దగ్గరకు అప్పుడప్పుడు వస్తుండేవాడు. వెంకటేశ్వరరావుకు మోకాలినొప్పులుండేవి. కూచోవాలన్నా, నడవాలన్నా ఆయనకు బాధగా ఉండేది. చేత్తో కర్ర పట్టుకొని, ఆవూతంతో అడుగలో అడుగు వేసుకొంటూ మెల్లిగా నడుస్తుండేవాడు. ఆయన పడుతున్న అవస్థ చూచి కనకయ్యగారు ఆయన్ను రామకోటయ్య తాతగారి దగ్గరకు తీసుకుపోయి చూపిద్దామనుకొన్నారు. రామకోటయ్యగారు "తాతగారు' 'గా ఆంధ్రదేశానికి సుపరిచితులు. మాస్టరు సి.వి.వి. అనుయాయి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి శిష్యులు. ఆధ్యాత్మిక సంపద కలిగిన మహనీయుడు. అరవిందులు వ్రాసిన "సావిత్రి' ' ఇతిహాసాన్ని అయన తెలుగులోకి మధురంగా అనువదించాడు. ఆయన ప్రార్థన చేస్తే - లేదా చేత్తో స్పృశిస్తే- అనేక రోగాలు మటుమాయంకావటం, బాధోపశమనం కావటం చాలా మందికి తెలిసినవిషయం. ఆంధ్రదేశంలో ఆయనకు అశేషశిష్యగణం ఉంది. రామకోటయ్యగారి శక్తి మీద అపారవిశ్వాసం గల కనకయ్యగారు ఒక రోజు మధ్యాహ్నం రామకోటయ్యగారి ప్రార్థనాసమయానికి చేరుకొనేటట్లుగా వెంకటేశ్వర రావును తీసుకొనిపోదామనే ఉద్దేశంతో వచ్చి వెంకటేశ్వరరావును కార్లో ఎక్కించుకొని, గుంటూరు అనందతీర్థ అగ్రహారంలో ఉంటున్న రామకోటయ్యగారి దగ్గరకు బయలు దేరారు. మధ్యదారిలో, విశ్వమందిరం దగ్గర కారాపి, వెంకటేశ్వరరావును తీసుకొని, మందిరంలోకి మాస్టరుగారి దర్శనార్థం వెళ్ళారు.

మాస్టరు గారి గదిలోకి అడుగు పెట్టగానే, అక్కడున్న భగవాన్ సత్యసాయి బాబా ఫోటో, షిర్డీసాయి బాబాఫోటో, వెంకటేశ్వర స్వామిఫోటో, ఇంకా జిల్లెళ్ల మూడి అమ్మ ఫోటో మొదలైనవాటితో పాటు నిలువెత్తు శ్రీవిశ్వయోగివిశ్వంజీ వారి ఫోటో.. వీటినన్నింటిని చూడంగానే వెంకటేశ్వరరావు గూడా- ఒక ప్రక్కకాళ్ళు వంగక బాధపెడుతున్నా- మెల్లిగా వంగి నమస్కారం చేశాడు. మాస్టరుగారు ఆయన ముఖాన బొట్టుపెట్టారు. ఆయన కుడి

మోకాలు చిప్ప దగ్గర, ఛాతీలో బాధకలుగుతున్న విషయం పసిగట్టి, బాధవేస్తున్న ప్రదేశాల్లో విభూతితో రుద్ది, "ఫరవాలేదు.. మళ్ళీరండి! తగ్గిపోతుంది"అన్నారు మాస్టరుగారు. ఆ తర్వాత ఆయన కనకయ్యగారితో కలిసి రామకోటయ్యగారి దగ్గరకు వెళ్ళాడు. తాతగారు కూడా ఆయనకు నొప్పిగా ఉన్న ప్రదేశాలలో విభూదిరాచి, "అప్పుడప్పుడూ వస్తూ ఉండండి! క్రమక్రమంగా నొప్పులు తగ్గిపోతవి" అన్నారు.

మాస్టరు గారి దివ్యకర స్పర్శ తాలూకు మధురానుభూతులు, వారి ప్రేమార్ద్రవచనాలు వెంకటేశ్వరరావును విశేషంగా ఆకర్షించాయి.మళ్ళీ విశ్వమందిరానికి పోవాలనే ప్రేరణ ఆయనకు కలిగింది. ఈమారు ఆయనంతట ఆయనే, తనకొడుకును సహాయంగా తీసుకొని మాస్టరుగారి దర్శనానికి వెళ్ళాడు. మాస్టరుగారు అయన కాలినొప్పి ఇంకా తగ్గలేదని తెలుసుకొని, మళ్ళీ విభూతిరాచి, "చిటికెడు విభూతి కర్పూరం కలిపిన నీళ్ళల్లో వేసి, బాధ ఉన్నచోటమెల్లిగా ఆనీళ్ళతో మర్దన చేయండి. ఆ తర్వాత గోరువెచ్చని నీళ్ళతో స్నానం చెయ్యండి! మీకు వీలైనన్ని సార్లు "ఓంశ్రీసాయిరాం గురుదేవదత్త" అనే మంత్రం జపిస్తూ ఉండండి.! "అని ఆదేశించారు. ఆయన సరేనని మేస్టరుగారు చెప్పినట్లే చేశారు. అదివరకు ఎక్కడికి పోవాలన్నా ఎవరన్నా ఆయన్ను పట్టుకొని తీసుకొని పోవలసివచ్చేది. మాస్టరుగారు చెప్పినట్లు చెయ్యటం మొదలుపెట్టగానే - ఒకవారంరోజుల్లోనే - ఎవరిసాయం లేకుండానే- తనంతతానే కర్రపట్టుకొని నడవగల స్థితికి వచ్చాడు.

ఒక రోజు మాస్టరుగారి ప్రియశిష్యుడు శ్రీలింగంశెట్టిఈశ్వరరావు మాస్టరుగారికి విశ్వమందిరంలో పాదపూజచేస్తున్నాడు. ఆసమయంలో 'వెంకటేశ్వరరావు నువ్వుకూడా పూజ చెయ్యి!" అన్నారు. అంతవరకూ- అయన విశ్వమందిరానికి వచ్చినప్పుడెల్లా మాస్టరుగారు ఆయన క్రింద కూచోలేడని ఒక కుర్చీ తెప్పించి వేయిస్తుండేవారు. అటువంటివారు ఆనాడు క్రిందకూచోని ఈశ్వరరావుతోబాటుపూజ చేయమంటుంటే, కాదనలేక, భక్తప్రపత్తులతో, అట్లాగేనని సంతోషంతో తలవూపి, నమస్కరించి, చేతిలో ఉన్న కర్ర నేలమీద పడవేసి ఈశ్వరరావు ప్రక్కన చతికిలబడ్డాడు. మొదటకూచుంటున్నప్పుడు కొంచెం బాధ అనిపించింది గాని, పూజమొదలై ఆపూజ చేస్తున్నంతసేపు ఆయనకు తనకు గుండెజబ్బున్న విషయంగాని, మోకాళ్ళనొప్పులుగానీ ఏవీ జ్ఞాపకం రాలేదు. దాదాపు ముప్పావుగంట సేపు ఆయన అట్లాగే కూచోని పూజచేశాడు. మాస్టరుగారి కృపాకటాక్షం భక్తులబాధలను ఎట్లా పటాపంచలుచేస్తుందో ఆయనకు ఆనాడుబాగాతెలిసి వచ్చింది. ఆతర్వాత ఆయన చేత్తోకర్ర పట్టుకొనే అవసరం రాలేదు. మామూలుగా నడవగలిగేవాడు. మాస్టరుగారు ఆయన్ను వెంటబెట్టుకొని పాదపూజకు ఆహ్వానించేభక్తుల ఇండ్లకు తీసుకొనిపోతుండేవారు. విశ్వనగర్ ఇంకా అప్పుడు నిర్మాణ దశలోనే ఉంది. స్థూపం ఇంకాపూర్తికాలేదు. సాయంసమయాల్లో మాస్టరుగారు ఆయన్ను వెంట బెట్టుకొని విశ్వనగర్ స్థలికి తరచు వెళ్ళివస్తుండేవారు. మాస్టరుగారి సమక్షంలో ఆయన ఎప్పుడూచిన్మయానందమూర్తిగా ఉండేవాడు. ఎవరన్నాఆయన్నుచూస్తే'ఈయన గుండెజబ్బు

మనిషనిగానీ, ఒకప్పుడు మోకాళ్ళ నొప్పులతో బాధపడుతుండేవాడనిగాని అనిపించేది కాదు. మాస్టరుగారి సమక్షంలో అంతచలాకీగా ఉండేవాడాయన.

మాస్టరుగారు ఆయనకు తాము లోకానికి ప్రసాదించిన "ఓం శ్రీసాయిరాం గురుదేవదత్త" నామమంత్రానికి మూలస్వరూపమైన, ప్రతిభక్తుడూ ఆ మంత్రాన్ని తాను జపించేటప్పుడు మననం చేసుకోవలసిన, సాయిదత్త స్వరూపాత్మకమైన, దత్తుడు, సాయి, తాము ఉన్న ఫోటో, వెండి విశ్వగురుపాదుకలూ ఇచ్చి ఆయన్ను అనుగ్రహించారు. వాటిని ఆయన తనపూజాగృహంలో పెట్టుకొని, భక్తి ప్రపత్తులతో నిత్యం అర్చిస్తూండేవాడు. రోజూ నిద్ర లేవగానే నూటెనిమిది సార్లు, పడుకోబోయే ముందు నూట ఎనిమిది సార్లు ఒక నియమంగా మాస్టరుగారు ప్రసాదించిన మంత్రాన్ని జపించటమేగాక, ప్రతిదినం వీలైనన్నిసార్లు ఆమంత్రాన్ని మననమ చేసుకొంటూ ఉండేవాడు.

"నీకుదేవుడన్నా, పూజలన్నా అంతనమ్మకం లేదు కదా! మరి విశ్వం మాస్టరుగారిలో నువ్వు ఏంచూచి ఇంత ఇదౌతున్నా?"వని కొంతమంది మిత్రులు ఆయన్ను పరిహాసంచేస్తూ అడిగేవాళ్ళు? అందుకాయన "మాస్టరుగారి దగ్గరికిపోయి, ఒకసారి వారిని దర్శించండి!కారణం మీకే తెలుస్తుంది. ఆయన మామూలు మనిషి కాదు- మహాత్ముడు. అన్నికులాల వాళ్ళనూ, అన్ని మతాలవాళ్ళనూ, తరతమ భేదం లేకుండా దగ్గరికి తీసుకొంటారు. భగవంతుడొక్కడే! మానవులంతా ఒక్కటే! ప్రేమేమనమతం. మానవత్వమే మనకులం. మనమంతా సమైక్యంగావాలి. ఒకడికి పదిమంది, పదిమందికి ఒకడు సాయపడుతుండాలి. మన మనస్సులన్నింటిని ఏకం చెయ్యాలి.విశ్వశాంతిని సాధించాలి-అని ఆయన చెప్పేమాటలు నాహృదయాన్ని తాకినయ్. అటువంటి ఉన్నత భావాలుగల మహాత్ముడి మార్గదర్శకత్వం ఈనాడు లోకానికి ఎంతో అవసరం. అందుకనే ఆప్రేమమూర్తిని గురువుగా భావిస్తూ ఆయన అడుగుజాడల్లోపయనించాలని ప్రయత్నిస్తున్నాను. దేవుడనేవాడొకడుంటే ఆయన విశ్వం మాస్టరులాగానే ఉంటాడు" అని బదులు పలికేవాడు.

ఒకరోజు మాస్టరుగారు ఆయన్ను తీసుకొని విశ్వనగర్ వెళ్ళారు. అప్పటి కింకా అక్కడ స్థూపం నిర్మించబడలేదు. స్థూపనిర్మాణానికి ఆలోచనలు కొనసాగుతున్నాయి. మాస్టరుగారు వెంకటేశ్వరరావును చూచి "ముందుముందు ఇక్కడ మంచినీటి అవసరం చాలా ఉంటుంది. బోరింగ్‌కు ఎక్కడ బావుంటుందో చూచి చెప్పు!" అని ఆదేశించారు. వెంకటేశ్వరరావు ఆస్థలంఅంతా తిరిగి ఈశాన్యదిశలో ఒక చోటు చూపించి "ఈచోటు ప్రశస్తంగా ఉంటుంది స్వామీ!" అని సూచించారు. మాస్టరుగారు తమప్రక్కనే ఉన్న ఈశ్వరి వైపు చూచినవ్వారు. లోగడమాస్టరుగారు "మణికర్ణికాఘట్టం" అని చూపించిన ప్రదేశాన్నే - ఆవిషయం ఏమీ తెలియని వెంకటేశ్వరరావ్ సూచించట ంచూచి ఆమె మాస్టరుగారి దివ్యశక్తికి ఆశ్చర్యపోయింది. ఆ చోటులో మాస్టరుగారు కొబ్బరికాయకొట్టి , కర్పూరం వెలిగించారు. ఆతార్వాత కొన్నాళ్ళకు అక్కడ నీళ్ళు పడ్డాయి. మాస్టరుగారి దివ్యాశీస్సులతో వెంకటేశ్వరరావు విశ్వనగర్

లోని బోరింగు పంపు ఏర్పాటుకు అట్లామూలమయ్యాడు.

మాస్టరుగారు జన్మదినోత్సవంనాడు రామకోటయ్యగారు (తాతగారు), కస్తల హనుమంతరావు మొదలైనవాళ్ళతో కలసి వెంకటేశ్వరరావు విశ్వమందిరంలో భోజనం చేస్తున్నాడు. మాస్టరుగారు వాళ్ళ దగ్గరే ఉన్నారు. భోజనాలైన తర్వాత వెంకటేశ్వరరావు లేచి, లేవడానికి ఇబ్బంది పడుతున్న రామకోటయ్యగారి చెయ్యి పట్టుకొని, వారిని లేవదీశాడు. అదివరకు కర్ర సాయంతో నడిచేవాడికి, ఆతర్వాత మాస్టరుగారి ఆశీస్సుల వల్ల అదేమీ అక్కరలేకపోయింది. తానే ఇతరులకు సాయపడేబలాన్ని పుంజుకొన్నాడు. రామకోటయ్యగారి చెయ్యిపట్టుకొని ఆయన్ను ఇంటికి సాగనంపడానికి కారు దగ్గరికి వెంకటేశ్వరరావు తీసుకపోతుంటే గోగినేని కనకయ్యగారు మొదలైన వాళ్ళు ఆశ్చర్యపడసాగారు. అప్పుడు మాస్టరుగారు వాళ్ళను చూచి వెంకటేశ్వరరావు ఇంకాముందుముందు లోకానికి ఎంతో సేవచేయవలసి ఉంది. అందుకే భగవంతుడు ఆయనకు వెనకటి శక్తి మళ్ళీ కలిగించాడు" అన్నారు.

(సశేషం)



# మరోసారి సాయికథలు

- అక్కిరాజు రమాపతిరావు

## హరీకాబేటా, జరీకాపేటా

'సంశయాత్మా వినశ్యతి' అన్నాడు భగవంతుడైన పార్థసారధి. ఎందుకని? తన ముద్దుల మరది, వేడుక చెలికాడు, ఆశ్రితుడు, శిష్యుడు అయిన అర్జునుడిలో దృఢమైన నమ్మకమూ, శ్రద్ధాబలపడేందుకు? వీటినే సాయినాధుడు శ్రద్ధ, సబూరీ అన్నాడు. సబూరీ అంటే విశ్వాసం. చిత్రం! ఈ పదానికి తెలుగులో కూడా వాడుక ఉన్నట్లే ఉన్నది. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారంతటి సాహిత్యలోకచక్రవర్తి కధలు-గాధలు అనే తమ రచనలో ఈ మాట ప్రయోగించారు. అది సరే అలా ఉంచుదాం.

'నమ్మకం ఉండాలి. లేకపోతే చెడిపోతారు' అని భగవంతుడు అనటం నమ్మకాన్ని నొక్కిచెప్పడానికే. అందుకేగాబోలు నమ్మిచెడిన వారూలేరూ, నమ్మకచెడిపోతే పోయేరూ' అనే సూక్తి తెలుగులో వినపడుతుంది.

అయితే పరమయోగులు విశ్వాసంలేనివాడిని ఈసడించుకోరు. అటువంటి విశ్వాసాన్ని కూడా తామే అనుగ్రహిస్తారు. అదివారికొక ఆహ్లాదం. 'విశ్వాసోధర్మమూలంహి, ప్రీతిః పరమసాధనమ్' అని బ్రహ్మసమాజం ప్రబోధిస్తుంది. ఆ నమ్మకాన్ని కలిగించవలసినవాణ్ణి కూడా నేనే అని అభయ వాక్కు ప్రసాదించారు భృక్త రహిత తారకరాజయోగమనే చక్కని రాజమార్గమును లోకులకు చూపిన కరుణావరుణాలయుడు కుంభకోణం మాస్టరుగారుగా ప్రధితయశస్కులైన మాస్టర్ సి.వి.వి. మహాశయులు. మహాయోగీ, మహోదారులాయన.

నమ్మకం లేనిది ఎవరూ ఏ పనీ చేయలేరు. విశ్వాసమే ఆశ్వాసం. భగవాన్ శ్రీ రామకృష్ణ పరమహంస తమ శిష్యులను తమను పూర్తిగా పరీక్షించవలసిందిగా కోరేవారుట. తాము శిష్యులను పరీక్షించాల్సిన పనిలేదు. అద్దాల అరలోని వస్తువులలాగా తన దరిజేరినవారి అంతరంగమంతా ఆయనకు కరతలామలకమే. ఒకసారి ఒక శిష్యుడు శ్రీరామ కృష్ణ పరమహంసను నిజంగానే పరీక్షించాలని అనుకున్నాడు. శ్రీరామకృష్ణులు అర్ధరాత్రివేళ అందాల చందమామ ఆకాశంలో వెన్నెలలహరులమధ్య విహరిస్తుండగా పంచవటికి వెళ్ళారు. ఈ శిష్యుడికి ఉత్కంఠ కలిగింది. పరమయోగీశ్వరి శారదామణి దగ్గరకు వెళ్లి ఈయన

అచ్చుటా ముచ్చటా ప్రారంభించకూడదూ! ఏమో! నౌబత్ ఖానా దగ్గర నక్కి నక్కి చూస్తున్నాడు. శ్రీరామకృష్ణులు దివ్యభావపారవశ్యంతో తమ కుటికి వెళ్లుతుండగా ఈ శిష్యుడు కంటబడ్డాడు. ఏమిరా ఇప్పుడిక్కడ ఉన్నావు? అనగానే ఆ శిష్యుడు తలవంచుకున్నాడు. శ్రీ రామకృష్ణుడికి చాలా సంతోషం కలిగింది. భేష్! మంచిపని చేశావు సుమా! అని అతడి ఆంతర్యాని పసిగట్టి మెచ్చుకున్నాడు. అదీ పరమయోగుల కృపాయత్త చిత్తం. పసివాడు అసహ్యం చేసుకుంటే తల్లి కోప్పడుతుందా ?

ఇలాటిదే శ్రీ శిరిడి సాయినాధుడి దివ్యానుగ్రహ లీలా విలాసం కూడాను. ఎన్ని జన్మలలోనో చేసుకున్న పుణ్యం పండితేనే ఆయనను పరీక్షించాలన్న కోరిక ఎవరికైనా కలుగుతుందేమో? అది తీరుతుందేమో?

బొంబాయిలో హరికానోబా అనే పెద్దమనిషి ఒకాయన ఉండేవారు. ఈయనెప్పుడూ శిరిడి వెళ్లలేదు గాని ఈయన స్నేహితులూ, బంధువులూ సాయిబాబాలీలలగూర్చి చెబుతూ ఈయనను ఉక్కిరిబిక్కిరిచేస్తుండేవారు. కాని ఆ మహానుభావుడు నమ్మలేదు. ప్రతి విషయంలోనూ అనుమానమే ఈ పెద్దమనిషికి. సందేహం పుట్టిన తరువాతే ఈయన దేహం పుట్టింది. స్వయంగా పరీక్షించి అందులో నెగ్గితేనే సాయిబాబాను నమ్మాలనుకున్నాడీప్రబుద్ధుడు. చూద్దాం ఆయన బండారమేమిటో నని అట్టహాసంగా జరీ తలపాగా, తళతళలాడే చడావులు ధరించి దర్పంగా శిరిడీ బయలుదేరాడు. అంట కొంతమంది స్నేహితులు బొంబాయినుంచి శిరిడీ పోతుంటే హరికానోబాగారు కూడా ఉండబట్టలేక తయారైనారు శిరిడీప్రయాణానికి. ద్వారకామాయి లోపలికితొంగిచూడగానే ఎందుకో సాయిబాబా పాదాలకు నమస్కరించాలని సద్బుద్ధి కలిగింది ఆయనకు. తొందరపాటున్నూ కలిగింది. అయితే చిత్తం శివుడిమీద భక్తి కొత్తచెప్పులమీద అన్నట్లైంది అతడి పరిస్థితి. ఆచెప్పులెక్కడ విడవాలో అతడికి తెలియలేదు. అయినా సాహసించి ఒక మూలకు పోయి అతి జాగ్రత్తగా గుర్తుండేట్లు పాదరక్షలు పరిత్యజించి మసీదు మెట్లెక్కాడు. అతనికి తెలియకుండానే హృదయంలో భక్తి సందడి చేసిందేమో "సాయిబాబా శరణము నీవేరా" అని నమస్కరించాడు హరికానోబా. శ్రీ సాయిబాబా ఆ పెద్దమనిషికి ఊదీని, ప్రసాదాన్ని అనుగ్రహించారు. ఇక ఆ పెద్దమనిషి గబగబా వెళ్ళి తాను కొత్త చెప్పులు విడిచిన మూలకు పోయి చూసే సరికి ఆయన గుండె గుభిల్లుమన్నది. భలే శాస్తి జరిగిందే అని చికాకు పడ్డాడు. అక్కడా ఇక్కడా అంతటా ఆత్రంతో వెదికాడు. భలే టోకరా వేశారే అని తనకు తాను అనుకొని మనసులోనే గింజుకున్నాడు. చెప్పుల దొంగల్ని శపించాడు.

ఇక ఏం చేస్తాడు? రుంజుకుంటూనే బసకు వచ్చాడు. ధుమధుమలాడుతూనే

స్నానం చేశాడు. మూలుగుతూనే పూజలు చేశాడు. రుస రుస లాడుతూనే నైవేద్యం పెట్టాడు. గురగుర లాడుతూనే భోజనానికుపక్రమించాడు. కాని తన కళ్లనిండా మనసునిండా ఆలోచనల నిండా కొత్తచెప్పులే తళ తళ మెరుస్తున్నాయి. ముఖం చిన్నబోయింది. మనసు పిన్నబోయింది. ఎట్లానో భోజనం కానిచ్చుకొని చేతులు కడుక్కోవటానికి బయటకు వచ్చాడు.

ఇంతలో ఒక దృశ్యం కనపడింది. ఒక మరారీ కుర్రాడి చేతిలో ఒక లారీ కర్ర వుంది. ఆ కర్ర చివర ఒక కొత్తచెప్పుల జత వేళ్ళాడుతూంది. వాడా నుంచి తనలాగే చేతులు కడుక్కోవడానికి బయటకు వచ్చినవారితో ఆ కుర్రాడేదో కొత్తసంగతి చెపుతున్నాడు. దాని సారాంశం ఏమిటంటే తనను సాయిబాబా పంపించాడుట. ఎందుకు? ఇక్కడ కొత్తచెప్పులు పోగొట్టుకున్నవారెవరైనా ఉన్నారేమో! కనుక్కోవలసిందని. అయితే ఆ విషయం ఏవిధంగా వాకబు చేయమని చెప్పాడుట సాయిబాబా! 'హరీకా బేటా జరీకా పేటా' అని అరుస్తూ వీధులవెంట తిరుగవలసిందిగా చెప్పాడుట. ఒకవేళ ఎవరైనా వచ్చి ఆచెప్పులు నావి అంటే, అతనికివ్వాల్సిందిగా కోరితే అతడి పేరు అతడి తండ్రిపేరు అడిగి అతనిపేరు హరీ, అతడి తండ్రి పేరు కానోబా అని అతడు చెప్పగలిగితేనూ, అంతే గాకుండా ఇట్లా ఆ చెప్పుల స్వంతదారును నేనే అని ముందుకు వచ్చే పెద్దమనిషి నెత్తిన జరీ తలపాగ ఉంటేనూ, అతడే సరియైన వ్యక్తిగా నిర్ధారణ చేసి అప్పుడా చెప్పుల జత ఇవ్వవలసిందిగా చెప్పారుట సాయిబాబా. ఆ కుర్రాడు ఈ చెప్పులు మీవా మీవా అంటూ అడుగుతున్నాడు అక్కడి వారిని. వాళ్ళు ఆశగా ఆత్రంగా చూస్తున్నారు. కాని-మీనాన్న పేరు కానోబాగారా అంటేపెదవి విప్పటం లేదు.

ఇక హరి కానోబా గారికి ఉవ్వెత్తున ఆశ్చర్యం ఆనందం చుట్టుముట్టాయి. ఆ కుర్రాడి దగ్గరకు పోయి ఈ చెప్పులు నావేనయ్యా అని రుజువు చేశాడు. తన జరీపాగ చూపించాడు. తన తండ్రిగారి పేరుకానోబా అని రూఢీ చేశాడు. సంతోషంగా తన చెప్పులు తాను తీసుకున్నాడు. అయితే అతడు ఆశ్చర్యాన్ని ఆనందాన్ని నిగ్రహించుకోలేక పోయాడు. తన జరీ తలపాగ అందరికీ కనిపించవచ్చునేమో గాని తన తండ్రిపేరు కానోబా, అనీ తన పేరు హరి అని ఈ సాయిబాబాకెలా తెలిసింది? మొట్టమొదటిసారి ఇప్పుడే కదా తాను శిరిడీ రావడం! బాబా తన పేరైనా అడగలేదే! శిరిడీకి రావడం కూడా తాను భక్తితో రాలేదే? బాబాను పరిక్షించటానికే వచ్చాడు. తన పరీక్షలో బాబా కృతార్థుడైనాడు. హరి కానోబా గారికి పట్టరాని సంతోషం కలిగింది. మహాయోగీశ్వరుడు, సిద్ధపురుషుడు ఈ సాయిబాబా అని నిస్సందేహంగా నిశ్చయానికి వచ్చాడాయన. సంశయాత్మా వినశ్యతి-కాదు సంశయాత్మ ప్రహర్షతి అనే దివ్యానుభావాన్ని , అభయ ప్రదానాన్ని, ఆనందానుభూతిని సాయిబాబా అతడికి కలుగ జేశాడు. ✪

# సాయి ప్రబోధాలు, ప్రవర్తనలలో కొన్ని ప్రతీకలు

శ్రీ సాయి బాబా తన దగ్గరకు వచ్చిన భక్తులు తనకు అరటి పళ్ళు సమర్పిస్తే తరచు వాటిని చక్కగా ఒలిచి తొక్కలు తమదగ్గర వుంచుకొని అంటే జాగ్రత్త చేసి పండుపదార్థం అంటే గుజ్జు ఆ భక్తులకు ప్రసాదించేవారట. అని సాయి సచ్చరిత్రలో వుంది. సాయిబాబా ఆ అరటి తొక్కలనేంచేసుకుంటారు? ఏంచేసుకునేవారు?! ఇందులో ఏదో పరమార్థం, ఏదో ప్రతీకార్థం ఉండి తీరాలి.

నాసిక్ నుంచి వచ్చిన ఒక డాబుసరి భకుడైన ములే శాస్త్రి గారికి తమకు సాముద్రికం బాగా తెలుసనే భేషజం వుండేది. సాయిబాబా హస్తరేఖలు పరీక్షించాలని ఆయన తాపత్రయ పడ్డాడు. నీ వచ్చిన పని చూసుకో శాస్త్రీ అని సాయిబాబా ఆయనకు నాలుగు అరటి పండ్లు ఇచ్చారు. నీ పని అంటే సాముద్రికం కాదు - జన్మ తరించే ప్రయత్నం అని బోధించారన్నమాట.

సరే ఇంతకూ అరటితొక్కలు సాయిబాబా తన దగ్గర అట్టి పెట్టుకోవడంలో అంతరార్థం ఏమిటి? అరటి చెట్టులో మానవునికి ఉపయోగించని పదార్థమంటూ ఉండదు. ఏమీ లేదు. ఒక అరటి కాయ లేదా ఆకు చెట్టునుండి వచ్చే నారా అన్నీ ఉపయోగ పడేవే. అరటి బోదె, కాండం నుంచి నార తీసి వాటితో చక్కటి పూలమాలలు రచిస్తారు. ఒక అరటి తొక్క మాత్రమే మానవునికి ఎందుకూ ఉపయోగ పడదు.

ఆ విధంగా మీ దుర్గుణాలను పనికి మాలిన వాటిని, నిస్సారమైన మీ ఆలోచనలను, దురూహలను నేను మీ నుంచి వేరు చేస్తాను. దాచేస్తాను. మీరు వాటిని నాకర్పించండి. నాదగ్గరే వుంచండి. నన్ను నమ్మండి. మిమ్మల్ని పోషిస్తాను. మీ నోరు తీపి చేస్తాను. మీకు పుష్టినిస్తాను. దుష్టుల సాంగత్యం విడిచినప్పుడు మీమీ ఇష్ట కామ్యాలను నెరవేరుస్తాను. అని అభయ ప్రదానం చేయటంకాదా సాయి అరటి తొక్కలు తను భద్రపరచడమంటే - అలా కాక పోతే ఏ భక్తుణ్ణో, ద్వారకామాయిలో తనను ఆశ్రయించుకొనివున్న ఏ పనివాడినో ఆ తొక్కలు జాగ్రత్తగా ఎవరూ తొక్కని చోట ఎవరి కాలి కింద పడలేని చోట వేయవలసిందిగా పురమాయించవచ్చుకదా! పనికి రాని మీ కామనలు నేను పదిల పరుస్తాను. మీ యోగక్షేమాలు నేను జాగ్రత్త వహిస్తాను - అని సంకేతించడం కదా శ్రీ సాయి అరటిపండు తొక్కలు తానుంచుకోవడం, అరటి పండు వలిచి చేతికిచ్చినట్లు అభయప్రదానం చేయడం!.

అరటిపండులో ఇంకొక విశేషముంది. అలవోకగా దానిని తినవచ్చు. అతి సులభంగా దానిని ఆరగించవచ్చు. తక్కిన చిన్న పండ్లలాగానో, తొనలలాగానో కాదు. రెండు తింటే

కడుపు నిండే పెద్ద పండు అది. దాని ఆస్వాదన క్షణికం కాదు. చౌకగా లభించే ప్రియమైన పండు అరటి పండు. అర్ధ పండు కాదది నిండు పండు. మీకు నిస్సారమైన జీవితాన్ని పరిహరించి నిండు జీవితాన్ని ప్రసాదిస్తానన్న మెండైన భరోసాతో కూడిన శ్రీ సాయి అనుగ్రహసాఫల్యం అది. ఆయన చేత మన సంచితాన్ని సమర్పించడం - మనోవాంఛితాన్ని అందుకోవడం ఆయన ప్రవర్తనలోని పరమార్ధం.

అలాగే కాల్చిన అగ్గిపుల్లలను సాయి సేకరించేవారట. అవి ఆయనకు ఎందుకు పనికి వస్తాయి? వాటినాయనేం చేసుకుంటాడు? ధుని లోకి అవి పనికి రావే? ఇక అవి మరి ఎందుకూ కొరగావే! అంటే ఇందులోనూ ఒక ప్రతీకాత్మతవుంది. నేను మీ ఉద్వేగ ప్రశమనకారకుణ్ణి అన్న అంతరార్ధం అందులో వుంది. మీ పాపాలను, తాపాలను, శాపాలను, లోపాలను, ప్రకోపాలను కాల్చి పారవేస్తాను. ఉపశమింపచేస్తాను. అని సంకేతించడమే ఆర్పిన అగ్గిపుల్లలు సాయిబాబా పోగు చేయడం. మీకు పనికి రానివి నాకివ్వండి అని తన దరి జేరిన వారినర్థించడం అది. అగ్గిపుల్ల రాజేయటాన్ని రాజుకోవడానికీ, నిప్పు స్ఫురించడానికీ విస్ఫురించడానికీ గుర్తు. ఉద్రేకాలు, ఇంద్రియోగ్రోగ్రతలూ నిప్పువంటివి. కోరికలు శరీరాన్ని దహించివేస్తాయి. ఆ దాహక శక్తి భరించరానిది.

భారతీయ సంస్కృతిలో ఆధ్యాత్మిక క్రతుకార్యకలాపాలలో అగ్నికి ఉన్న ప్రాముఖ్యం, ప్రాధాన్యం భారతీయులకు తెలియనిది కాదు. పరాశక్తిని మొదటగా దర్శించినవాడు అగ్నిదేవుడు కాబట్టి ఆయనకు దేవతలందరిలోను సర్వశ్రేష్ఠత, పావకత్వం లభించాయని పురాణాలు చెబుతున్నాయి. అమ్మవారు వహ్ని మండలవాసిని. దేవతలందరికీ ఆహుతు లందించేవాడు అగ్నిదేవుడే. అగ్నిద్వారానే సర్వపుణ్య కార్యాలు జరుగుతాయి. ఋగ్వేదం 'అగ్నిమీళే పురోహితం దేవం' అని ప్రారంభమవుతున్నది. అగ్ని సాక్షిగానే హిందువులు తమ ఇహలోక కార్యకలాపాలన్నీ జరుపుకుంటారు.

కాబట్టి కాల్చివేసిన అగ్గిపుల్లలను సాయిబాబా జాగ్రత్త పెట్టడంలో మీ పాప కర్మలన్నింటిని నేను కాల్చివేస్తానన్న అభయప్రదాన అంతరార్ధం ఇమిడి ఉన్నట్లు తోస్తున్నది. సన్యాసులు ధరించే కాషాయ పరిధానం కూడా అగ్నికి సంకేతమే. అపగతకల్మషులు, జ్ఞానాగ్నిదగ్ధకర్ములు పరివ్రాజకులని ఆ కాషాయ వస్త్రాల సంకేతం. మానియర్ విలియమ్స్ అని భారతీయ పురాణ విజ్ఞానఅధ్యయ వేత్త ఒకరుండేవారు. ఈయన భారతీయ సంస్కృతిపై, పురాణ విజ్ఞానంపై గొప్ప అవగాహన కృషిని సాధించారు. పరివ్రాజకులు కావి బట్టలు ధరించడంలోని అంతరార్థమిది అని ఆయన భారతీయుల మత సంకేతాల గూర్చిన గ్రంథంలో పేర్కొన్నారు.

సాయి బాబా నిరంతరం ధునిని నిర్వహించేవారు. శ్రీ రామకృష్ణ పరమహంసకు సన్యాసదీక్షనిచ్చిన భగవాన్ తోతాపురి కూడా నిరంతర ధుని ప్రజ్వలన దీక్షితుడు. విరజ హోమం ద్వారానే సన్యాస దీక్ష తీసుకోవడం జరుగుతుంది. 'సంహృతాశేషపాషండా, సదాచార ప్రవర్తికా, తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా' అని అమ్మవారి స్తుతి.

అట్లానే భక్తులకు తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదనచంద్రికలు దర్శింప జేశాడు సాయిబాబా. ఆయన 'భక్తి మత్కల్పలతిక' పశుపాశవిమోచనుడు'. ఆయన లోకానికి గావించిన ప్రబోధాలలో, లోకం పట్ల వ్యవహరించిన తీరు తెన్నులలో ఇటువంటి పరమార్ధ ప్రబోధక ప్రతీకలెన్నో ఉన్నాయి. ✦

## అమృత వర్షిణి

**(శ్రీ సత్యసాయి వచస్సుధ)**

'తాను నాటిన బీజములు మొలకెత్తి వృద్ధిగాంచి ఫలింపకున్న రైతుకెంత కష్టము కల్గునో అట్లే నేను మీ హృదయక్షేత్రముల వెదజల్లు లేదా నాటు సత్యము, ప్రేమ, శాంతము మొదలగు బీజములు మొలకలెత్తి వృద్ధిగాంచి ఫలింపకున్న నాకెంత విచారముగనుండుడో యోచింపుడు.'

సత్యమార్గమును నీవు అనుసరించునప్పుడు అపజయము అపజయముగా నీకు తోచదు. దుఃఖము దుఃఖముగా నీకు తోచదు.

తప్పుదారి నడిచితినని తెలిసికొనుటకును సవరించుకొని మరల మంచి మార్గమునకు వచ్చుటకును మానవుని కొక్కనికే తెలివిని భగవంతుడు ప్రసాదించియున్నాడు. అంతర్ముఖుడై, భగవతత్త్వ జ్ఞానముల చేతనే శాంతి సంతోషములు లభించగలవని అనుభవపూర్వకముగా తెలియవలెను.

మానసిక ధైర్యములేనందుననే దుఃఖము, అశాంతి కలుగును.

"మనస్సు శిశువు వంటిది. శిశువుతోకూడ తల్లిపోవుచు ఆ బిడ్డను పిల్చుచు ఉండిన యెడల ఆ శిశువు మరికొంత ముందుకు పోవునే కాని వెనుకకు మరలదు. కాని బిడ్డతోకూడ తల్లి పోక వెనుకకు మరలిన యెడల బిడ్డ భయపడి తల్లి యొద్దకు పరుగెత్తి ఆమెను కరుచుకొనును. కాబట్టి మానసిక వికారములను లక్ష్యము చేయవద్దు."

"మీ యిష్టము వచ్చిన మూర్తి యొక్క నామరూప ధ్యానమును మాత్రము విడువక కొనసాగింపుము. అపుడు నీ కోరిక ఫలించును".

# చిరుమామిళ్ళ సుబ్బదాసు (1802 -1882

- ఆచార్య బి. రామరాజు

యోగ భ్రష్టులైనవారు మరణానంతరం పుణ్యలోకాలు చేరి భోగా లనుభవించి మళ్ళా సదాచారసంపన్నుల యిండ్లలో పుట్టి పూర్వజన్మసంస్కారబలంతో యోగాభ్యాసపరులై సిద్ధికొరకు మరల ప్రయత్నిస్తారని భగవద్గీతలో (VI - 41,43) శ్రీకృష్ణ పరమాత్ముని ఉవాచ. దానికి ఉదాహరణం సుబ్బదాసుగా విఖ్యాతి పొందిన చిరుమామిళ్ళ సుబ్రహ్మణ్యం -సుబ్బయ్య అనే యోగిభక్తుడు. వీరభూమి కర్మభూమి ఐన పల్నాడులో మాచెర్లనుండి కారెంపూడి వెళ్ళే దారిలో దుర్గి, ధర్మవరం సమీపగ్రామాలు. పేరంటాలుగా పూజలందుకుంటున్న దిగుమర్తి వారింటిబిడ్డ, చిరుమామిళ్ళవారింటి కోడలు లక్ష్మమ్మ మందిరాలు లింగాలపేటలోను ధర్మవరంలోను ఉన్నవి. ధర్మవరంలో పమిడికొలకులగోత్రం చిరుమామిళ్ళ నరసయ్య తిరుమలమ్మలనే సదాచారపరులైన కమ్మ దంపతులుండేవారు. వ్యవసాయం వారి వృత్తి. కలిగినదానితో తృప్తి పడటం ఇతరులకు పెట్టగా మిగిలిందే తాము అనుభవించటం ఆ ధర్మదంపతుల నియమం. తిరుమలమ్మ పుణ్యాం పండి గర్భం ధరించినది. ప్రసవానికి పుట్టిల్లు ఓబులేశుని పల్లెకు పోయింది. ఏపూర్వజన్మసుకృతమో, ఏ ఋణానుబంధమో, పూర్వ జన్మలో యోగసాధన చేస్తూ తనువుచాలించి మిగతా యోగ సిద్ధికోసం అవతరించిన ఒక పుణ్యపురుషుని 1802 లో కన్నది. విధివిధానోక్తంగా బారసాల చేసి శిశువుకు సుబ్రహ్మణ్యం అని పేరు పెట్టినారు. అందరూ సుబ్బయ్య అని పిలవటం పరిపాటి. సుబ్బయ్య దినదిన ప్రవర్ధమానుడైనాడు. శైశవంనుండి కౌమారానికి మారుతున్న సుబ్బయ్య ప్రవర్తన వేరొక మాదిరిగా ఉన్నట్లు తల్లిదండ్రులు గమనించినారు. బాలుడైన సుబ్రహ్మణ్యం తన యీడు పిల్లలవలె ఆడుకోవటం పాడుకోవటం హఠం చేయటం అది కావలె ఇదికావలెనని అడగటం వంటి వేమీ చేయలేదు. పెట్టినది తిని ఏకాంతంలో ఉండేవాడు. నరసయ్య సుబ్రహ్మణ్యంను వీధిబడిలో వేసినాడు. అక్కడైనా తోడి విద్యార్థులతో కలిసి మెలసి వాడితేరుతాడనుకున్నాడు. బడి పంతులు శాంతుడు, పరమసాత్వికుడు, ఆనాటి వీధిబళ్ళలో చెప్పే చదువులన్నీ చెప్పినాడు. కృష్ణశతకం, నరసింహశతకం, దాశరథీ శతకం, భాగవతంలోని పద్యాలు నేర్పినాడు. పంతులు చెప్పే పాఠాలు వినటమేకాని సుబ్బయ్య మరల అప్పచెప్పేది లేదు. తోడిబాలురు బిగ్గరగా చదువుతుంటే వారితో కలిసి చదివేవాడు కాని వారితో ఆటపాటల్లో పాల్గొనే వాడు కాదు. కనుక వారంతా సుబ్రహ్మణ్యంను 'మొద్దబ్బాయి' అనేవారు. ఉపాధ్యాయుడు శాంతుడు కనుక ఆయన సుబ్బయ్యను ఎన్నడూ దండించలేదు. చదువుకు పనికి

రాడనుకున్నాడు. ప్రహ్లాదునివలె చదువుల్లోని సారమెల్లా చదివిన సుబ్రహ్మణ్యాం సంగతి తెలియక ఒకనాడాపంతులు నరసయ్య ఇంటికి వచ్చి "మీవాడు చదువుకు పనికిరాడు: వ్యవసాయంలో పెట్టు" మన్నాడు. నరసయ్య పంతులుతో "అయ్యా మీరన్నట్లే ఇతరులనగా విన్నాను. కాని మావాడు మేమందరం పడుకున్న తరువాత దీపం వద్ద కూర్చుండి చదువుతున్నాడు వ్రాస్తున్నాడు. పాఠాలన్నీ అప్ప చెప్పుతాడు, మీరే పరీక్షించండి" అన్నాడు. పంతులు పరీక్షించి సుబ్రహ్మణ్యాంకు అన్నిపాఠాలు వచ్చినవని తేల్చుకున్నాడు. ఆశ్చర్యంతో తిరిగి పోయినాడు. సుబ్బయ్య బడికి పోతునే ఉన్నాడు.

సుబ్బయ్య 8 ఏండ్ల ప్రాయంనుండే ప్రతిదినం మధ్యరాత్రి దీపంముందు కూర్చుండి నిశ్చలధ్యానమగ్నుడయ్యేవాడు, లేదా భక్తి జ్ఞాన వైరాగ్యభరితములైన పద్యాలో కీర్తనలో పాడుతుండేవాడు, వ్రాస్తుండేవాడు. అతడు 10వ యేట ఒకనాడు దీపానికెదుట కూర్చుండి ధ్యానమగ్నుడైనాడు. అట్లా ఎంతసేపున్నాడో కాని బలబల తెల్లవారింది. తిరుమలమ్మ చూచి పల్కరించింది. సుబ్రహ్మణ్యాం మారుపల్కలేదు. ఆమె భర్తకు చెప్పింది. ఆయన చూచి వైద్యుని తీసుక వచ్చినాడు. వైద్యునికి నాడి చిక్కలేదు. సుబ్రహ్మణ్యాం ముఖం బ్రహ్మతేజంతో వెలిగిపోతున్నది. అది గుర్తించిన వైద్యుడు సుబ్రహ్మణ్యాం అంతర్ముఖుడై ధ్యానపారవశ్యంలో ఉన్నాడనీ, రోగమేమీ లేదనీ ధైర్యం చెప్పి పోయినాడు. కొంతసేపటికి సుబ్రహ్మణ్యాం బహిర్ముఖుడైనాడు. తెలిసినవారు సుబ్రహ్మణ్యాం యోగభ్రష్టుడన్నారు; తెలియనివారేదో రోగమన్నారు. సుబ్రహ్మణ్యాంకు ఇట్టి సమాధిస్థితి రెండుమూడు దినాలకొకసారి కలిగేది. సమాధి కలిగినపుడల్లా 2-3 గంటలు బాహ్యస్పృహ లేకుండా ఉండేవాడు. సుబ్రహ్మణ్యాం ఎప్పటివలె బడికి పోతునే ఉన్నాడు, పంతులు చెప్పే పాఠాలు వింటునే ఉన్నాడు. కాని ఇంటి వద్ద ఆ చదువులు చదవటంలేదు. ఆతనిలో దినదినం పరవిద్య బలపడసాగింది. సుబ్రహ్మణ్యాంకు 12 ఏండ్లు నిండినవి. ఇంతలో దసరాపండుగు వచ్చింది. పూర్వం దసరా పండుగప్పుడు బడి పిల్లలు గడలు పట్టి పద్యాలు చదువుతూ వీధులు తిరుగుతూ పిల్లల ఇండ్లకు, కొందరు ముఖ్యుల యిండ్లకు పోయేవారు. గృహస్థులు పిల్లలకు పప్పు బెల్లాలు పంతులుకు సంభావనలు ఇచ్చేవారు. ఒకనాడు పంతులు పిల్లలను తీసుకొని దుర్గివేణుగోపాల స్వామి గుడికి పోయినాడు. పిల్లలు దసరా పద్యాలు చదువుతున్నారు. సుబ్రహ్మణ్యాం మాత్రం ఆపద్యాలు చదవటం లేదు; లోలోన ఏమో చదువుతున్నాడు. గ్రామం పెద్దలంతా ఆవేడుక చూస్తున్నారు. సుబ్బయ్యను చూచి 'మొద్దబ్బాయి' అంటూ వెక్కిరించినారు. పంతులు తన మరియాద కాపాడుమని సుబ్రహ్మణ్యాంను బతిమాలినాడు. సుబ్రహ్మణ్యాం పంతులుతో "ఇతర విద్యార్థులు చదవటం ఆపించండి; నేనొక్కడనే చదువుతాను" అన్నాడు. పంతులుకు ధైర్యం వచ్చింది. తోడిపిల్లలు చదవటం ఆపగనే సుబ్రహ్మణ్యాం చేతులు జోడించి ఆశువుగా 108 కంద పద్యాలు కేశవమకుటంతో చదివి ముగించి కన్నులు మూసుకున్నాడు, వేణుగోపాలస్వామిని హృదయంలో నింపుకున్నాడు. గ్రామ పెద్దలు, బడిపంతులు నివ్వెరపోయినారు. ఆనాడు పంతులు, నరసయ్య ఇంటికి పోయి మీ అబ్బాయి సాధారణుడు

కాడనీ, ఏకసంధాగ్రాహి, గొప్ప యోగి, భక్తుడనీ ఇక ఆతణ్ణి బడికి పంపనవసరం లేదనీ అన్నాడు.

తమ యింటి గేదెలను అడవికి మేతకు తోలుక పోయినా, తండ్రికి వ్యవసాయం పనుల్లో తోడుపడుతున్నా, తల్లికి ఇంటి పనుల్లో సాయపడుతున్నా, పగలంతా ఏపని చేస్తున్నా సుబ్బయ్య మనసు ఈశ్వరాయత్తమై ఉండేది. రాత్రి పూట భోజనానంతరం ఏకాంతంలో ధ్యానమగ్నుడై ఉండేవాడు లేదా ఏవో గ్రంధాలు చదవటమో వ్రాయటమో చేస్తుండేవాడు. తల్లిదండ్రుల అనుమతితో దుర్గికి పోయి వేణుగోపాలస్వామి ఆలయంలో కూర్చుండి స్వామిని సేవించి ప్రాతఃకాలాన ఇంటికి తిరిగి వచ్చేవాడు. మానవుడొంటరిగా తానెట్లా మసలుకున్నా పరవాలేదుగాని సమాజమధ్యంలో బ్రతికే మానవుడు ఆసమాజం ఆశించినట్లే నడుచుకోకపోతే ఆతణ్ణి చిన్నచూపు చూస్తుంది. సుబ్రహ్మణ్యం ప్రవర్తన ఆతని యీడు పిల్లల ప్రవర్తనకంటె భిన్నంగా ఉండటంచేత కొందరాతణ్ణి మొద్దబ్బాయి అంటే కొందరు పిచ్చివాడన్నారు. నరసయ్య తొలిదినాల్లో సుబ్రహ్మణ్యంకు తమ బఱ్ఱెలు ఆవులు కాసేపని అప్పగించినాడు. తనయీడు బాలురు చద్దులు కట్టుకొని పశువులు తోలుకపోయి మేపి చెర్లో తోలి ఆడుకుంటుంటే సుబ్బయ్య చెరువు కట్టపై కూర్చుండి ఆకాశంకేసి చూస్తూ ఏదో ఆలోచించేవాడు. ఒకనాడు మిట్టమధ్యాహ్నం గేదెలు చెరువులో ఉండగా గోపబాలురు ఆడుకుంటున్నారు. ఎక్కడినుండో ఒక ఆజానుబాహువు పొడుగాటి గడ్డం మీసాలతో చెరువుకట్టపైకి వచ్చినాడు. ఆతని వాలకం చూస్తే ఆకలిబాధతో ఉన్నట్లు కనపడ్డాడు. సుబ్బయ్య ఆయనకు దండంపెట్టి చెట్టు నీడన కూర్చుండజేసి ఆయెఱ్ఱటెండలో పరుగెత్తిపోయి తల్లి నడిగి బెల్లంపాలు తెచ్చి యిచ్చి ఆసాధువు ఆకలి తీర్చినాడు. సంతోషించిన సాధువు సుబ్బయ్యతపన, సాధన, ధ్యానములగురించీ, సాధించిన ప్రగతి గురించీ అడిగి తెలుసుకున్నాడు. భగవంతుడు, ప్రేమ, సనాతన ఋషి సంప్రదాయాల గురించీ, భౌతిక, ఆధ్యాత్మిక జీవితాలు వాటి సమన్వయం గురించి సుబ్బయ్య అడిగిన ప్రశ్నలన్నింటికీ సమాధానాలు చెప్పినాడు. సుబ్రహ్మణ్యం ఆసాధువునే తన గురువుగా ఎంచుకొని ఉపదేశం కోరితే ఆయన "నీకు గురువు వేరే ఉన్నారు. సమయం వచ్చినపుడు ఆయనే వచ్చి నీకు ఉపదేశం చేస్తారు. ఆయన ద్వారానే నీకు భగవద్దర్శనం ఔతుంది" అని చెప్పి నాల్కపై ఏమో వ్రాసి అల్లంతదూరం పోయి అదృశ్యుడైనాడు.

సుబ్బయ్య ఆనాడంతా ఆసాధువన్న మాటలే ఆలోచించినాడు. నాటి రాత్రి మంచి నిద్ర పట్టింది. నడిరేయి ఎవరో తట్టి లేపినట్లయినది. భగవద్ధ్యానం చేసి కాల్యములు ముగించినాడు. తల్లిదండ్రులు పాలేరు గాఢనిద్రలో ఉన్నారు. మెల్లగా ఇంటిబయటికి నడచినాడు. ఆకాశంలో ఒక కాంతి గోళం కనపడింది. దాన్ని చూస్తూ నడుస్తూ దుర్గి గ్రామం చేరినాడు. ఆకాంతిపుంజం దుర్గి వేణుగోపాల స్వామి గుడిపైన ఆకాశంలో నక్షత్రం వలె నిల్చిపోయింది. ఆలయం తలుపులు తెరిచే ఉన్నవి. సుబ్రహ్మణ్యం గర్భాలయం చొచ్చినాడు.

దీపాలవెలుగులో వేణుగోపాల స్వామి దివ్యమంగళ విగ్రహం చూస్తూ మైమరిచినాడు. స్వామి కన్నులనుండి కారుణ్యాతరంగాలు సుబ్రహ్మణ్యంలో ప్రవేశించినట్లైనది. స్వామిని స్తుతిస్తూ ఆశువుగా పద్యాలు చదివినాడు. హృదయంనుండి ఉప్పొంగి వస్తున్న భావాలకూ భాషకూ ఛందోగతికీ తానే ఆశ్చర్యపోయినాడు. సుబ్రహ్మణ్యంకు వేణుగోపాలస్వామి తనను పల్కరించిన అనుభూతి కలిగింది. ఆదివ్యానుభూతినే స్మరిస్తూ పారవశ్యంతో తెల్లవారకముందే ఇల్లు చేరినాడు. ప్రతిదినం అర్ధరాత్రిదాక ధ్యానం, అటుతరువాత స్నానాదికాలు ముగించి ఉ...కి పోయి, వేణుగోపాల స్వామిని దర్శించి వచ్చి తాటాకులపై వ్రాస్తుండటం, తెల్లవారిన తరువాత తండ్రి చెప్పిన పనులు చేయటం సుబ్రహ్మణ్యంకు పరిపాటి ఐనది. సుబ్బాయ్యవాలకం చూస్తున్న బంధువులు, ఇరుగు పొరుగు, నర్సయ్యదంపతులను అదేపనిగా మందలిస్తుండటం చేత సుబ్రహ్మణ్యంకు పెండ్లి చేస్తే ఒక దారిన పడుతాడనుకున్నారు.

ఆదినాల్లోనే అద్దంకి తిరుమల తాతాచార్యులనే గొప్పపండితకవి త్రికాలజ్ఞులు, జ్ఞానపూర్ణులు, దైవ సాక్షాత్కారం పొందిన మహానుభావులు శిష్యసమేతంగా ధర్మవరం వచ్చి ఆధ్యాత్మ ప్రబోధలు చేస్తున్నారు. సుబ్రహ్మణ్యం తాతాచార్యుల ప్రబోధలు వింటున్నాడు. ఆయనవద్దకు వచ్చే భక్తుల అనుభవాలు గమనిస్తున్నాడు. తాతాచార్యులే తనకు భగవంతుడుద్దేశించిన కారణగురువనుకొన్నాడు. సుబ్రహ్మణ్యం ఆర్తినీ వినయవిధేయతలను గమనించిన తాతాచార్యులవారు సమయం కోసం ప్రతీక్షిస్తున్నారు. జిజ్ఞాసతో సుబ్రహ్మణ్యం అడిగే ప్రశ్నలన్నింటికీ సమాధానాలు చెప్పుతూ శంకారాహిత్యం చేస్తూ అతని అంతఃకరణం జ్ఞాన ప్రకాశంతోనింపుతున్నారు. ఒకనాడు సుబ్రహ్మణ్యం పొలంపనికి పోయినపుడు, నరసయ్య తన బావమరది ఓబులేశునిపల్లె బొల్లినీడి అ(క)బ్బయ్యతోడుగా తాతాచార్యుల వారిసన్నిధికి పోయి తనకొడుకును తనకు దక్కేటట్లు చేయవలసిందనీ, పెండ్లిచేసుకొని ఇంటిని వ్యవసాయాన్ని దిద్దుకునేటట్లు బోధించవలసిందనీ బతిమాలినాడు. (సశేషం)

# శ్రీ వల్లభ చరితామృతం

హిందీ మూలం : శ్రీ కళాధరభట్ తెలుగుసేత : డా॥ తిరుమలరామచంద్ర

## పుష్టిమార్గ విశిష్టత

పుష్టిమార్గసంప్రదాయం తక్కిన భారతీయ సంప్రదాయాలకన్నా భిన్నమైనది. ఈమార్గం వైదికసంప్రదాయంకన్నా భిన్నమైంది. ఇది భక్తి సంప్రదాయమైనప్పటికీ తక్కిన భక్తిసంప్రదాయాలకన్ననూ వేరైనది. ఇదొక విశిష్టమైన మార్గం. దీనిలో ఇతర సంప్రదాయానుయాయులకు ప్రవేశం ఎంతమాత్రం ఉండదు, వారి ప్రవేశం నిషిద్ధం. ఇతర ధర్మానుయాయులు ఈసంప్రదాయపు గురువుద్వారా 'బ్రహ్మసంబంధం' స్వీకరించి ఈ మార్గంలోని గురువు 'అనుగ్రహం' పొందితే-అనగా గురుసమ్ముఖుడైతేనే ఈసంప్రదాయంలో ప్రవేశించగలుగుతారు.

వల్లభులు పుష్టిమార్గాన్ని ప్రమాణభేదంతోను (భిన్నప్రమాణాలతోను) ఇతర మార్గాలకంటే భిన్నమని చెప్పారు. ప్రమాణభేదాత్ భిన్నోహిపుష్టిమార్గో నిరూపితః? అందువల్ల పుష్టిమార్గీయ జీవులు అన్య మార్గానుయాయులకన్నా భిన్నులు-'తస్మాజ్జీవాః పుష్టిమార్గే భిన్నా వనసంశయః' వారిజీవనప్రయోజనంకూడ- కేవలం భగవత్ 'సేవే' కావడం వల్ల భిన్నమైంది? 'భగవద్రూపసేవార్థం తత్సృష్టిర్నాన్యథాభవేత్'. భగవవత్సేవనుకేవలం సంపూర్ణదోషరహితుడూ, శుద్ధుడూ అయిన వ్యక్తేచేయగలుగుతాడు. శుద్ధేరేవ భగవత్సేవాకర్తుం శక్యతే. సుబో. ఆత్మనివేదనంద్వారా బ్రహ్మసంబంధం వల్లనే జీవుడు సర్వదోషనివృత్తుడై శుద్ధుడవుతాడు. బ్రహ్మసంబంధకరణాత్ సర్వదోషనివృత్తిర్హి! ఈ విధంగా నిర్దుష్టమైన జీవులనే భగవంతుడు స్వీకరిస్తాడు. నిర్దుష్టం హి భగవాన్ గృహ్ణాతి? సుబో. బ్రహ్మసంబంధం గురువుద్వారా జరిగినప్పుడే సేవ ఫలిస్తుంది-'గురుద్వారాభజనం నిరూపింత తదేవ ఫల పర్యవసాంయ'- సుబో.

1. సారాంశమేమనగా - పుష్టిమార్గం ప్రధాన విశిష్టత బ్రహ్మసంబంధం పొందిన వారికే పుష్టిమార్గోపదిష్టమైన సేవను చేసే అధికారం ఉంది, ఇతరులకు లేదు. ఈదీక్షకు పూర్వం 'శరణ మంత్రం' ఉపదేశిస్తారు. ఈవిధిలో గురువు శిష్యుని ఎదుట మూడుసార్లు 'శ్రీకృష్ణః శరణం మమ' అనే వాక్యం ఉచ్చరించి భగవచ్ఛరణాగతికి ప్రతీకగా శిష్యుని మెడలో తులసీమాలను వేస్తాడు. శరణమాత్రంద్వారా నవవిధ భక్తిని, ఆత్మనివేదనం బ్రహ్మసంబంధం ద్వారా ప్రేమ-లక్షణా భక్తిని శిష్యునికి ప్రసాదిస్తాడు.

2. బ్రహ్మసంబంధ దీక్షానంతరం గురువు శిష్యునికి అతని అభిలాషనుబట్టి శ్రీకృష్ణుని బాల్యక్రీడలలోని నవనీతచౌర్యాది విభిన్న లీలల విభిన్నస్వరూపాలనుంచి

ఒకస్వరూపాన్ని అందజేస్తాడు. ఈ స్వరూపం విగ్రహంగానో, చిత్రపటంగానో వుంటుంది ఈవిధంగా విగ్రహాన్ని గాని, చిత్రపటాన్నిగాని అందజేయడానికి ముందు గురువు అతనిని తన 'స్పర్శద్వారా 'పుష్టం' చేస్తాడు. 'గురుసేవయాపి జ్ఞానం సిద్ధ్యతి, నాసేవా తదా 'పుష్టాభవతీతి నిశ్చయతే యదిస్వయంపదాత్ స్పృశతి గురుః' సుబో. పుష్టిమార్గంలో గురువుస్పర్శతో ఈ విధంగా 'పుష్టమైన స్వరూపానికే సేవ చేయడం పద్ధతి. శిష్యుని విశేషమైన వాంఛపై గురువు కుంకుమాంచితమైన తనపాదాలతో అంకితమైన వస్త్రాన్ని కూడ, సేవకోసం శిష్యునికి అనుగ్రహిస్తాడు. అతనిసేవకూడ భగవత్స్వరూపం వంటిదిగా అనుగ్రహిస్తాడు. గురువు సేవార్థం స్వరూపాన్ని అనుగ్రహించి శిష్యుని సామర్థ్యయోగ్యతానుసారం ఒకస్వరూప 'సేవకు ఆ 'ప్రకారమైన ఉపదేశమేచేస్తాడు; శిష్యుడు కూడ ఆ'ప్రకారమే సేవచేస్తాడు; స్వకల్పిత పద్ధతిలోగాని, ఇతరపద్ధతులలోగాని చేయడు-'శ్రీమదాచార్యమార్గేణ నానాన్యేనాపికదా..రా? శ్రీహరి, మ.ప్ర. శిష్యుడు సేవించదగిన భగవత్స్వరూపంపై అంతిమాధికారం గురువుదే. సేవ్య శిష్యునికి ఏకారణం వల్లనైనా అసామర్థ్యం ఏర్పడితే- సేవసరిగా చేయలేకపోతే, అతడు తన జీవితకాలంలో గాని, జీవితోత్తర కాలంలో గాని, తనసేవ్యమూర్తిని శృంగారాదివైభవసమేతంగా, తన గురువు సన్నిధికి అప్పగిస్తాడు.

3. సాక్షాత్తు గురువే పూర్ణపురుషోత్తమరూపంలో తన శిష్యుని సేవ్యస్వరూపంలో అతని ఇంట విరాజిల్లుతాడు. సేవకుడు (శిష్యుడు) తన సేవ్యస్వరూపంలో భగవంతుని ఏ స్వరూపాన్ని భావిస్తాడో, భగవంతుడు ఆస్వరూపం ధరించి ఆవిగ్రహంలో ఆవిర్భవించి ఉంటాడు. భక్తేచ్ఛోపాత్తరూపంలో, మరొకరూపంలో ఉండడు. - 'తద్రూపం తత్పచస్థితమ్' సుబో. అందువల్ల పుష్టిమార్గంలో సేవ్యసేవకులసంబంధం వ్యక్తిగతమని అంగీకరింపబడింది. పుష్టిమార్గపూజావిధానంలో పూజకుని భావం పూజ్యరూపంలో సమారోపిత మౌతుంది. 'పూజాయాం హి స్వస్మిన్ స్థితో భావాదిః పూజ్యేసమరోప్యతే! సుబో. భక్తుని భావం ద్వారా (భావైరంకురితమ్) భగవంతుడు ఆవిర్భవిస్తాడు. ఏభక్తునిసేవ్యస్వరూపం ఏదో, ఆసేవ్యునిసేవ, సేవకుని వ్యక్తి గతధర్మం. ఏపత్నికి ఎవడుపతియో, లేక ఏమాతకు ఎవడు పుత్రుడో, ఆపతిసేవ ఆ పత్నికి, ఆపుత్రుని ముద్దుచేయడం ఆతల్లికి వ్యక్తిగతమైన ధర్మం లేక అధికారం. అన్యోన్య అన్యతలో అనగా ఏక రూపంతో రసం సంపూర్ణంగా నిష్పన్న మౌతుంది. అనుభావక అనుభావితులు ఇద్దరి మధ్యసేవితమైరసం గుప్తంగా ఉంటుంది రసం గుప్తంగా ఉంటేనే రసత్వం పొందుతుంది. -'రసోగుప్తఏవరసత్వమాపద్యతే! సుబో. అగుప్తమైనరసం-బహిరంగమైనరసం అనిపించుకోదు. అది రసాభాసం. అగుప్తోరసః రసాభాసస్స్యాత్! సుబో. రసాన్ని ఏకాంతంగా అనుభవించడం అవసరమైనందుననే, 'సేవకసేవ్యుల, 'సేవ్యసేవకుల'నే పరస్పర వ్యక్తిగత భావం చాల అనివార్యమౌతున్నది. సేవకునిలో సేవ్యేతరభావన (తనుసేవించేవానికంటే మరొకడున్నాడనే భావం), సేవకునిలో స్వసేవకాంతరాపేక్ష (స్వసేవకునికన్న మరొక సేవకుడు కావాలనే భావం) విలక్షణమైన భక్తిభావనకు సర్వధా విరుద్ధమైనవి, కనుక, ఈ సంప్రదాయంలో శ్రీకృష్ణభగవానుడొక్కడే సేవ్యుడుగా అంగీకరించినా,

భగవంతుడు తనభక్తుల భావానుకూలమైన స్వరూపం ధరించి, ఏభక్తునికి ఎంతవరకు ఎట్టి అధికారం వుంటుందో, అతనిలో అంత వరకు అట్టి లీలలే చేస్తాడు తత్తదధికారానుసారేణ తత్తల్లీలాః ప్రాదుర్భవంతి!సుబో. భగవంతుడు భక్తులందరితోను ఒకే రూపంధరించి, ఒకేసమయంలో లీలలు చేయకపోవడానికి అంతరంగకారణం తనభక్తులను మాత్సర్యక్లేశంనుంచి రక్షించడానికే! సర్వాసామెకత్రరమణేమాత్సర్య కృతః క్లేశః భవేత్! సుబో. నిత్యజీవితంలో రసభావ లీలల నిగూఢానుభూతినే వల్లభమార్గంలో పరమపురషార్ధరూపంలో ఉపదేశించడంవల్ల ఇది వ్యక్తిగతమార్గం; అందువల్లనేదీనిని 'స్వతంత్రభక్తి'మార్గం అన్నారు. ఈ మార్గం ఎంత 'సంకీర్ణ'మైనదంటే దీనిలో కేవలం 'ఇద్దరే' ఒక్కటై నడువగలరు. వల్లభులు తమసంప్రదాయంలో సామూహిక గ్రహణభజనాదులు అసంగతాలు మాత్రేమేకాక 'అసంభవా' లనికూడ అన్నారు. "భగవత్సేవోపయోగిక దాసరూపాంశేన వా సర్వేలోకాః స్వదాసభావే నావిర్భవంతి ఇతీచ్ఛయా భగవానేకదేశభావం ప్రకాశితవాన్. సముదాయే గ్రహణ భజానద్యనుపపత్తేః"-సుబో.

4.అందువల్లనే, వల్లభసంప్రదాయంలో తన భగవంతుని అంతరంగసేవను ఆభగవంతునిసేవకుడే చేయగలడుగాని మరొకడుకాదు. అంతేకాదు, ఆభక్తుని పత్నీ పుత్రులుగాని పరివారంవారుగాని(బ్రహ్మసంబంధ దీక్ష గ్రహించనప్పుడు ఆభగవంతుని అంతరంగసేవ చేయజాలరు. బహిరంగసేవను కూడ వారు 'శరణమంత్ర' దీక్షతీసుకొనినప్పుడే చెయగిలరు. పుష్టిమార్గీవైష్ణవునికి తనస్వామిసేవ తన జీవితపు ఏకైన ధర్మాచరణ. దీనిలో ఇతర ధర్మానుయాయుల, లేక ఇతరవైష్ణవ సంప్రదాయాల వ్యక్తుల జోక్యం తమగురువుల విషయంలోనేకాక వారిసేవాపద్ధతిలోను, విధులలోను జోక్యంగా భావిస్తారు. ఎందుకనగా, వారి స్వామిసేవా విధి ప్రణాళికకు ఏకైక ఆదేశకుడు, నిర్దేశకుడు అతనిగురువే. అతని స్వామి ప్రతిసేవి పద్ధతిలోను ఏకైక ప్రామాణ్యం అతని గురువు ఆజ్ఞతప్ప మరొకటికాదు. వల్లభులు గురువు ఆజ్ఞను పాలించడాన్నే 'సేవాకృతి! అన్నారు. దీని దార్శనిక ఆచారాత్మక వివేచనం ఈ గ్రంధంలో మరొక చోట ఉన్నది.రెండవది: అంతేకాక అతని స్వామిపై అంతిమాధికారం అతని గురువుదే. మూడవది: గురువు శిష్యుని యెడల విశేషానుగ్రహం చూపడానికి అతని స్వామికి తానే అంతరంగసేవ చేయవచ్చు. (ఇంకావుంది)

*అలసస్యకుతో విద్యా అవిద్య స్యకుతోధనమ్।*
*అధనస్యకు తోమిత్ర మమిత్రస్యకుతః సుఖమ్॥*

సోమరి పోతుకు విద్య ఎట్లా వస్తుంది? విద్యలేని వాడికి ధనం యెక్కడ నుంచి వస్తుంది? ధనంలేని వాడికి మిత్రులెక్కడనుంచి వస్తారు? మిత్రులులేనివాడికి సుఖం యెక్కడి నుంచి వస్తుంది?

## త్యాగరాజకృతి

కన్నడ

నిన్నాడనేల నీరజాక్ష
కన్నవారి పై కాకయునేల
కర్మానికి తగినట్లు కార్యములు నడిచేని
ధర్మానికి తగినట్టు దైవముబ్రోచేని
చిత్తానికి తగినట్టు సిద్ధియుగలిగేని
విత్తానికి తగినట్టువేడుకనడిచేని
సత్త్వరూపనిన్ను సన్నుతి జేసి
తత్త్వము దెలిసిన త్యాగరాజునకు

దేశ్యతోడి - ఆది.

రూకలుపదివేలున్న చేరెడు నూకలుగతిగాని
ఓమనసా
కోకలు వెయ్యున్న కట్టుకొనుట కొకటెగాని
ఓమనసా
ఊరేలిన తాబండుటమూడుమూర కావెగాని
ఓమనసా
నూరుభక్షణములబ్బిన నోటి కంతేగాని
యేరుసందడి పాదిన పాత్రకు తగు నీరు వచ్చుగాని
సారతరునిహరిని త్యాగరాజసన్నుతుని
మరవకే మనసా....

ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి




ఆలయములు వేరైనా ఆరాధికుడొక్కడే. మతాలు వేరైనా ఆశయం ఒ.

మానవతే మానవుని ప్రథమ కర్తవ్యం.

**BOOK POST** **Printed Matter**

To

Smt. & Sri..........................................................

.........

.........

.........

*if undelivered please return to*

**SARVAARTHA SANKSHEMA SAMITHI**

*3-6-393, Plaza Apartments, Street No. 3,*

*Himayatnagar, Hyderabad - 500 029.*